
ఎన్నిసార్లు చూచినా తనివితీరని
మహోత్తర జానపద చిత్రం!
జి ఆర్ ప్రొడక్షన్స
గండికోట
రహస్యం
దర్శకత్వం: బి. విఠలాచార్య
నిర్మాత: యన్.కె. గంగారాం
నిర్వహణ: జగన్నాథ్

# ఉత్తరాలు

## పాఠకులకి మనవి

వనితాలోకం వ్యాసరచన పోటీలో మొదటి బహుమతి పొందిన రచయిత్రి శ్రీమతి వి. కమల గారు తమ జీవిత వివరాలు తెలుపుతూ రాసిన ఉత్తరాన్ని ఈ కింద వేస్తున్నాము— సం.

శ్రీమతి వి. కమల

జీవిత వివరాలు: జననం 1942 విజయనగరంలో. మావారి ఉద్యోగరీత్యా ప్రస్తుతం విశాఖ పట్టణంలో ఉంటున్నాం. అప్పుడప్పుడు చిన్న వ్యాసాలూ, సంఘానికి సంబంధించినవి రాస్తూ వుంటాను. ఆధునికసాహిత్యమంటే యిష్టం.

## స్వాధికారం—అపహరణవాదం

తూరుపు పాకిస్తాన్‌లో జరుగుతున్న మారణ హోమాన్ని గురించి మాట్లాడుతూ మదరాసుముఖ్య మంత్రిగారు, రాష్ట్రాలకి స్వాధికారం ఇవ్వకపోతే భారతదేశంలో కూడా ఎందరో ముజీబుర్‌రెహమానులు పుట్టవచ్చువన్నారని వార్త వెలువడింది. మళ్లీ ఆయనే, స్వాధికారంకోరేవారు అపహరణవాదులు మాత్రం కారన్నారనే వార్తకూడా వెలువడింది.

ఇక మన పార్లమెంటులో బంగ్లాదేశ్ ని బల పరుస్తూ ఒక తీర్మానం చేశారు, ఆతీర్మానాన్ని అన్ని పార్టీల వారూ బలపరిచారు. తెలంగాణాపోరాటంతో మొదలైన వేర్పాటువాదాలు ఇంకాఎన్ని వస్తాయో తెలియదు. ఎటువంటికీ కూడా మనపార్లమెంటు సభ్యులు తగిన మద్దతు ఇస్తారా? తెలంగాణాకి నాటికి 66.6 మంది శాసన సభ్యులు ఫేటు వేస్తే అది ఏర్పడవచ్చు, అన్న వార్త ఒకటి వచ్చింది కాబట్టి ఈ ఉపోద్ఘాతం చెయ్యవలసి వస్తోంది. ఇక్కడ వేర్పాటు వాదాలన్నిటినీవిదేశాలలోని శాసన సభలు ఆమోదిస్తూ తీర్మానాలు చెయ్యవచ్చు కూడా!

——ఎ. రామారావు, ఉల్లాస్‌నగర్

## రాజధాని కబురు

రాజధాని కబుర్లు అన్న శీర్షిక క్రింద శ్రీ బి. నాగేశ్వరరావుగారు వ్రాస్తున్న శీర్షికల్ని శ్రీ బ్రహ్మానందరెడ్డి స్తోత్రం తప్ప వేరే అసలు విషయములు గమనిస్తున్నట్లు లేదు.

19.3.72 తేదీగల ఆంధ్రసచిత్ర వారపత్రికలో బాధ్యతారహితమైన లేఖ ప్రచురించటం జరిగింది. ఆ లేఖలో శ్రీ నాగేశ్వరరావుగారి సారాంశం

తెలంగాణా ఉద్యమంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి కేంద్ర పార్లమెంటరి బోర్డుకు రాజీనామా పంపినపుడు శ్రీ కామరాజు, శ్రీ నిజలింగప్ప అది ఆమోదించక హైదరాబాద్‌లో శ్రీ బ్రహ్మానందరెడ్డిని ఉండనిచ్చినది 1969 రాష్ట్రపతి ఎన్నికలో శ్రీ సంజీవరెడ్డి, బలపరుటానికట. శ్రీ సంజీవరెడ్డిని బలపరిస్తే శ్రీ సంజీవరెడ్డి రాష్ట్రపతి అయినతర్వాత రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధిస్తారని చెప్పారట. ముందుగా చెప్పారుట.

వి ముందుగా శ్రీ బ్రహ్మానందరెడ్డిని గెలి అభ్యర్థినీ తర్వాత ఎట్లా రాష్ట్ర విధిస్తారని ముందుగా చెప్పారు.

వాస్తవ విషయాలు: ఒక రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించాలంటే, కేంద్ర హోంమంత్రి ప్రతిపాదించాలి. తరువాత కేంద్రమంత్రివర్గం కేంద్ర మంత్రివర్గ రాజకీయ వ్యవహారాల ఉపసంఘం, ప్రధానమంత్రి అధ్యక్షతన సమావేశమై నిర్ణయం తీసుకొని రాష్ట్రపతికి సిఫార్సు చేస్తేకాని రాష్ట్రపతి సంతకం చేయటానికి వీలుండదు.

ఈ విషయాలు శ్రీ బ్రహ్మానందరెడ్డికి తెలియక కాదు. కేవలం మధ్యంతర ఎన్నికలలో విశాఖ పట్నంలో ఒక సమావేశంలో శ్రీ బ్రహ్మానందరెడ్డి శ్రీ సంజీవరెడ్డిపై బాధ్యతారహితమైన ఆరోపణ చేశారు. ఎన్నికలలో పరస్పర ఆరోపణలు నిందలు సర్వసాధారణం. కాని వాస్తవదృక్పథంలో రాజకీయ పరిశీలకులు గమనించాలి [అందుకే రాజకీయ నాయకులంటే ప్రజలలో విశ్వాసం పోయింది ]

ఇకపోతే శ్రీ నిజలింగప్ప, శ్రీ కామరాజు దివ్య దృష్టి కలిగి లేరు. పార్లమెంటరి బోర్డులో కాని హైదరాబాద్‌లో కాని శ్రీ బ్రహ్మానందరెడ్డిని ముఖ్యమంత్రిగా కొనసాగమని చెప్పినది వేరే సమర్థ వంతమైన నాయకుడు లేకపోవటమే.

కాంగ్రెసు రెండుగా చీలుతుందని కాని, రాష్ట్రంలో కాంగ్రెసు అధిష్టాన వర్గంపై తిరుగుబాటు జరుగుతుందని కాని, శ్రీమతి గాంధి శ్రీ సంజీవ రెడ్డి నామినేషన్ పత్రాలపై సంతకాలు చేసి స్వయంగా దాఖలు చేసి తరువాత చివరి క్షణంలో వ్యతిరేకంగా అంతరాత్మ ప్రబోధం లేపుతారని కాని ఆనాడు ఒక్కర్కు కూడా ఊహించ లేదు. కాంగ్రెసు ముక్కలు చీలిన విస్తరి అవుతుందని ఎవరూ భావించ లేదు. చివరకు శ్రీ కామరాజు, శ్రీ నిజలింగప్ప శ్రీమతి గాంధి స్వంత పార్టీ అభ్యర్థికి వ్యతిరేకంగా పని చేయటం తప్పని ఒక్కమాట చెప్తే అంతా మరచిపోతాం కలిసి వుందాం అని కూడా అన్నారు వాస్తవ విషయాలు కప్పిపెట్టి, ఒకే ఒక వ్యక్తి స్తోత్రంతో నిండివున్న వ్యాసాలు ఏ పార్టీకి సంబంధంలేని ఆంధ్రపత్రికలో ప్రచురితమవటం రాజకీయ పరిశీలకులకు ఆశ్చర్యంగా వుంది

మేడూరి మోహన్‌రావు, [విజయవాడ].

* * *

26.3.71 వ తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని బి. నాగేశ్వరరావుగారి రాజధాని కబుర్లు చదివాక ఈ ఉత్తరం రాయాలనిపించింది.

వారన్నట్టుగా— 20 లక్షల వోట్లు ప్రత్యేక రాష్ట్రానికి వ్యతిరేకించిన వారివి, 1 లక్షల వోట్లు ప్రజాసమితి గెల్చుకొన్నవి [అంటే వారి ఉద్దేశ్యంలో ప్రత్యేక రాష్ట్రాభిమానులవి] — కాదు.

ఇక్కడ— సవ్యులికంగా కొన్ని విషయాలు మనవి చేయాలి.

తెలంగాణానుండి పోటీ చేసిన— ప్రముఖపార్టీలు ప్రజాసమితి, తెలంగాణా కాంగ్రెసూ, కొందరు ఇండిపెండెంట్లూ, ఎస్. ఎస్. పీ. అందరూ ప్రత్యేక రాష్ట్రవాదానికి అనుకూలురే. ఆ నినాదంమీదే పోటీ చేశారు. వాళ్లకు పడిన వోట్లన్నీ ఆ నినాదం మీద ఆధారపడి పడినవే అన్న సంగతి— అందరూ— ఓడిపోయిన, తె కాం వారు, ఎస్. ఎస్. పి. వారు గూడా ఒప్పుకోవలసిన విషయం. కాదనలేని విషయం. ఇక శ్రీ నాగేశ్వరరావుగారనుకుంటున్న లేదా అంటున్న ప్రత్యేక రాష్ట్ర వ్యతిరేక పార్టీల విషయం అధికార కాంగ్రెస్— కమ్యూనిస్టులు, జనసంఘం— ఇవేకదా.

జనసంఘం వారికి పడ్డ వోట్లు— వారి సిద్ధాంతాల మీద విశ్వాసం ఉండి— ఆ పార్టీకి కట్టుబడి వున్న వాళ్లవి. [అందులో ప్రత్యేక — సమైక్యవాదు లిద్దరున్నారు] కాని వేర్పాటు—సమైక్యత— ఆధారంగా పడ్డవి కాదు. పైగా — సిద్దిపేట ఉపఎన్నిక తర్వాత జనసంఘం— తను వైఖరిని మార్చుకొన్న సంగతి అందరికీ తెలిసిందే. ప్రత్యేక రాష్ట్రానికి అనుకూలం కాకపోయినా — వ్యతిరేకం మాత్రం కాదు. అది— వారి ఎన్నికల ప్రచారం చూసిన వాళ్లకు స్పష్టంగా తెలుస్తుంది. తెలియవలసి ఉంది. ఇక కమ్యూనిస్టులు. వీరికీ— వారి పార్టీ సిద్ధాంతాల మీద ఆధారపడే పడ్డవి వోట్లు— ఒక విద్యార్థిగాండాలోనే ఎక్కువ వచ్చినవి. ఒకే ఒకప్పుడు కమ్యూనిస్టుల కంచుకోట అన్న సంగతి మరువరాని విషయం. అక్కడ ఆ పార్టీ అభిమానులే ఎక్కువ — రాష్ట్ర ఐక్యత—వేర్పాటు ప్రాతిపదిక కాదు. — పైగా అధికార కాంగ్రెసు ఇంకా చైతన్యవంతంగా పనిచేస్తే ఇంకా సీట్లు వచ్చేవన్నారు నాగేశ్వరరావుగారు. కాంగ్రెసు వారు చేయగలిగినంతా చేశారు. ప్రత్యేక రాష్ట్రానికి అనుకూలురు అనుకున్న ఆఫీసర్లను, ఎన్. జి. వో. నాయకులను బదిలీలు చేశారు. ఎన్. జి. వో. నాయకులకు ఆశలు పెట్టి తమ వెంట త్రిప్పుకొని ప్రచారం చేయించు కున్నారు [వరంగల్‌లో]— లాఠీ చార్జీలు చేయించారు. డబ్బు ఖర్చు విషయం చెప్పక్కర్లేదు గదా. ఎంత డబ్బు ఖర్చు పెట్టినంటే మాత్రం — వరంగల్‌లో రెండవ స్థానమైనా వస్తుందనుకున్న జనసంఘం కంటె ఎక్కువ వోట్లు తెచ్చుకో గలిగారు.

ఈ క్రింద ఇచ్చిన వివరాలు చూస్తే— ప్రత్యేక రాష్ట్రానికే ప్రజాభిప్రాయ మనుకూలమని స్పష్టంగా తెలుస్తుంది:—

మొత్తం పోలైనచెల్లిన వోట్లు: 39,39,484.

ప్రజా సమితి, తె. కాం. ఎస్. ఎస్ పి ప్రత్యేక రాష్ట్ర వాదులు. 19,87,461.

శాతం 50.45%

అధికార కాంగ్రెసు—వారు బలపరచిన ఇండిపెండెంటు, కమ్యూనిస్టు [సికింద్రాబాదు, సిద్దిపేట]లలో కలిపి 14.48.871 [36 78%]

ఇందులో ఆ ఇద్దరివి 1.65 480 తీసివేస్తే కాంగ్రెసుకు 12,85,391— అంటే 32.57% మాత్రమే.

ఇదితర ఇండిపెండెంట్లు: 5.03,152.
కమ్యూనిస్టులు వన్ని — 12.77%.
[ఇందులో స్థానికంగా వలుకుబడి ఉన్నవారు ప్రత్యేక రాష్ట్రాభిమానులు ఉండవచ్చు]

పై వివరాలుచూస్తే— రాష్ట్రం— తమకు ప్రత్యేకంగా ఉండాలనేదే తెలంగాణా ప్రజల వాంఛ అన్నది స్పష్టం అవడంలేదా. ఈ ఉత్తరం దయచేసి ప్రచురించండి.

ఎన్. ఆర్. సారథి, [హైదరాబాదు—]

## ముగ్గురు మూర్ఖులు

ఈ వారం [26.3.71] ఆంధ్రపత్రికలో శ్రీ మహేష్‌గారు వ్రాసిన 'పెజాస్వామ్యం వర్ధిల్లాలి' అనే ముగ్గురు మూర్ఖులు వ్యాసం చదివేక అది వందన లేఖ వ్రాయ మనస్సు పుట్టి వెంటనే రాసే స్తున్నాను. వాస్తవికతను అతిసామాన్యునికి కూడా అర్థమయే హాస్య ధోరణిలో మూర్ఖుల నోటంట పలికించిన శ్రీ మహేష్‌గారు అభినందనీయులు. ఈ శీర్షిక మీ పత్రికకు వన్నె తెచ్చుచున్నదనుటలో అతిశయోక్తి ఏమియు లేదనియు, సత్యదూరము కాదనియు నా నమ్మకము. మూర్ఖుల సంభాషణ చదివేక చవట ప్రదేశ్ ముఖ్యమంత్రి నాల్గవ మూర్ఖునిగా వచ్చి — ఇట్టి వానికి మంత్రి పదవి నిచ్చి, బహదూర్‌సింగ్ హత్యకి పరోక్ష కారకుడ నైన నాకే లక్ష రావాలి అంటే ఇంకా బాగుండు నేమో!!! కాని శీర్షిక ముగ్గురు మూర్ఖులు గదా? అందుచేత ముఖ్యమంత్రి పాత్రకు స్థానంలేకపోయిం దని తెలుసు కొన్నాను.

పూడిపెద్ది శ్రీరామమూర్తి, [భోగాపురం].

## సీరియల్

26.3.71 తేదీనాటి ఆంధ్రపత్రిక వార పత్రికలో మిత్రులు జె. పురుషోత్తమరావు [కంకుట్ల] గారు మీరు ప్రచురిస్తున్న మల్లెలు—ఎర్రగులాబీలు నవలలో నేను సృష్టించిన రోజా పాత్ర చిత్రణ పట్ల నా మీద, మీ మీద ప్రదర్శించిన తమ తీవ్రమైన కసిని చూచాను. శ్రీ రావు గారు రోజాపాత్ర చిత్రణపట్ల ఎందుకంత కసి వహించారో నాకు బోధపడటం లేదు. పైగా ఆ పాత్రను చిత్రణను రచయిత ప్రత్యేకంగా ఒక మతాన్ని కించపరచే ఉద్దేశ్యంతో చిత్రించారని ఆరోపించడం, ఘోరంగా ఉంది. నేను నా రచనలో ఎక్కడా ఏ మతాన్ని ప్రమేయంగా చూపించలేదు— నిందించ లేదు—.

కాగా రోజా క్రైస్తవ అమ్మాయి అని చెప్పడం కమ్యూనిటీని కించపరచే ఉద్దేశ్యంతో కాదు. వారు చదివినంతవరకు రోజా చెడ్డ పాత్రగా కనుపించినా ఆ చెడుతో ఏ మాత్రం నిమిత్తంలేని ఆ పాత్ర యొక్క సమగ్ర పరిచయానికి దోహదంచేసే విధంగానే ఉపయోగించడం జరిగింది. రోజాపాత్ర పరిణామ క్రమంలో ఎంత ఉదాత్త స్థాయినందు కుంటుందో? పవిత్రతను సంధించు కుంటుందో? చి . . చూచి . . . తెలుసుకొని నిర్ధరించ కిన విన్నయమేనని మిత్రులకు మనవి చేస్తు

## ఉత్తరాలు

ఇకపోతే శ్రీ పురుషోత్తమరావుగారు తమ విమర్శలో చెడ్డవాళ్ళు హిందూ కన్యలలో లేరని రచయిత అభిప్రాయమా? అని తమకు తామే ఒక ప్రశ్న వేసుకొని దాన్ని నా మీదకు విసిరి నదరు నవలను ప్రచురిస్తున్న పత్రికాధిపతుల సద్భావం పట్ల సందేహాన్ని వెలిబుచ్చుతూ సవాల్ చేశారు. చెడ్డతనం.... మంచితనం .... ప్రత్యేకించి ఏ మతమూ గుత్తగొన్న లక్షణం కాదు. అలా అని నా రచనలో ఎక్కడా హిందూ కన్యలు పవిత్రులని చెప్పుకోలేదు. అసలు రచయితను హిందువుల ప్రతినిధిగానో లేక అన్యమత ద్వేషిగానో శ్రీ రావుగారు చిత్రించడం అనుచితంగా భావిస్తున్నాను. అందు చేత వారు అవహేళనాత్మకమైన వివాద ప్రవృత్తితో చేసిన ఈ ఆరోపణను స్వీకరించడానికి నేను సిద్ధంగా లేనని సవినయంగా మనవి చేస్తున్నాను.

సీరియల్ పూర్తిగా చదివిన పిదకప వారు చేసే నిర్మాణాత్మకమైన ఎట్టి విమర్శనైనా సహృదయంతో స్వీకరించగలనని తెలుపుకొంటున్నాను.

మల్లెలు — గులాబీలు రచయిత.

• • •

2—4—71 సంచికలో శ్రీ ఎస్. ఎ. ముబారక్ [హైదరాబాద్] గారు వ్రాసిన ఉత్తరం చదివాను. వారు 'ప్రపంచపు ఏడువింతలు పురాతన, మధ్యకాలపు, ఆధునాతన అనిమువ్విధములు అని వ్రాసారు. ఆధునాతనపు వింతలు రాకెట్, టెలివిజన్ మున్నగు నవి అని వ్రాసారు.

అయితే ఈ ఆధునాతనపు వింతలు ఏడు గదా? రాకెట్, టెలివిజన్ మున్నగునవి ప్రపంచపు వింతలలో ఉన్నవని చదివాక నాకు చాలా వింతగా అనిపించింది.

రచయితను అపార్థం చేసుకోవడం నా ఉద్దేశ్యం కాదు.

[నస్మి, హైదరాబాదు]

### మనవి

కొన్ని అనివార్య కారణాలవల్ల ఈ వారం కూడా ప్రత్యేకమైన బొమ్మలని వెయ్యలేకపోతున్నాము.

—సం॥

పైవారమే ప్రారంభం!

## పెద్దకథ

# వదినగారిచెల్లెలు

రచన: 'కిరణ్మయి'


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం · 16—4—'71
శ్రీ విరోధికృన్నామసం॥ చైత్ర మాసం బహుళపంచమి
సంపుటము: 64 సంచిక: 32

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకులు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 40 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: 'ద్రోహి'లో సావిత్రి


తలుపుతెరవడానికి
ఈతాళంఉపయోగ
పడుతుందను
కుంటాం
కొత్త యుగం
అంతులేని
మెజారిటీ


ఆతరహా ప్రయోగం
నామీదే నేమో
పాకిస్తాన్


గవర్నరుగనక ఒక
నిచ్చెన వేసి సాయ
పడినట్టయితే
ఈపాటికే పైకెక్కి
కూర్చునేవాణ్ణి
మంత్రివర్గం
ఒరిస్సా


అజయ్
మెజారిటీ
ప బెంగాల్

# రవాణా సిబ్బంది, విద్యార్థులమధ్య పేచీలు

దూరభారాలు ఉన్న నగరంలో రెండు రోజులు బస్సులు నడవకపోతే ఏమవుతుంది? స్కూళ్ళ కాలేజీలకు విద్యార్థినీ విద్యార్థులు పోలేరు. కనీసం వేళకు చేరుకోలేరు. కార్యాలయాల్లో పనిచేసే సిబ్బంది, కర్మాగారాల్లో పనిచేసే కార్మికులూ అంతే. ఆలస్యంగా వెళ్ళ కలిగినా, ఆటో రిక్షాలకు, టాక్సీలకు కిరాయి ఇచ్చుకోగలిగే వారు మాత్రమే. పైగా బస్సులు లేవంటే టాక్సీల వాళ్ళు, ఆటో వాళ్ళు, సైకిలు రిక్షాల వాళ్ళు రేట్లు పెంచేస్తారు. నలుగురు కలిసి ఒక టాక్సీ తీసుకొనడం కూడా కుదరదు. నలుగురి దగ్గరనుంచీ మీటర్ల చార్జీ కావాలంటాడు టాక్సీవాలా. ఏమైనా అంటే ఇవాళ కాకపోతే ఎప్పుడు ఇస్తారు సార్ అంటాడు. ఐతే అసలు బస్సులు లేకపోవడం ఎందుకు జరగాలి? ఇది ఆంధ్రప్రదేశ్ రాజధానీ నగరానికి ఒకరకంగా పరిపాటై పోయింది. కాని వరుసగా రెండురోజులు బస్సులు లేకపోవడం, రోడ్ రవాణా సంస్థ సిబ్బంది అధిక వేతనాల కోసం సమ్మె చేసినప్పుడు కూడా ఈమధ్య జరగలేదు. సిబ్బంది, సమ్మె చేస్తే, ప్రజాసేవ పేర, పోలీసులు, హోంగార్డుల సహాయంతోనైనా రవాణా సంస్థవారు సర్వీసు నడుపుతారు. మొత్తం మీద సమ్మె సంపూర్ణంగా సఫలం కాకుండా చూస్తారు. ఈసారే మైందో కాని దాదాపు 45 గంటలు—మార్చి 31న, ఏప్రిల్ 1 నగరంలో బస్సులు నడవలేదు. ఏప్రిల్ 2 ఉదయం నుంచి నడవ సాగాయి. అంటే సిబ్బంది చేత పని చేయించడానికి రవాణా సంస్థకు రెండు రోజులు పట్టింది. అది కూడా సమ్మె చేసినందుకు శిక్షలు వేయమని రవాణా మంత్రి హామీ ఇచ్చిన మీదట.

## టికెట్ల గురించి పేచీ

మార్చి 31 ఉదయం మలక్‌పేటలోని ముంతాజ కాలేజి విద్యార్థులు ఐదారుగురు మలకపేటలోనే ఒక బస్సు ఎక్కారు. కండక్టరు టికెట్లు తీసుకోమంటే తీసుకోమన్నారు. వాదన, సంవాదన, బెదిరింపులు— బస్సు ఆగిపోయింది. వెనుక నుంచి వస్తున్న బస్సులు కూడా బారుగా ఆగిపోయాయి. ట్రాఫిక్ జామ్. పోలీసులు పరిగెత్తుకొని వచ్చారు. వాళ్ళ దిగైనా పోవాలి లేకపోతే టికెట్లు కొనాలి. లేకపోతే బస్సు కదలదని కండక్టర్ హటం. అతనికి ఇతర బస్సుల సిబ్బంది వత్తాసు. చివరికి పోలీసులు ఆ ఆరుగురు విద్యార్థులను అరెస్టు చేశారు. అంతటితో ఈ కథ ముగియవలసింది. కాని ముగియలేదు. అరెస్టు వార్త ముంతాజు కాలేజి విద్యార్థుల్లో శరవేగంతో ప్రాకిపోయింది. గుంపు గుంపులుగా బయల్దేరారు. రోడ్ మీద పోతున్న బస్సుల మీద రాళ్ళు రువ్వారు. ఒక బస్సు డ్రైవరు, ఆరుగురు ప్రయాణికులు రాళ్ళు తగిలి గాయపడ్డారు. ఈ విషయం రోడ్ రవాణా సంస్థ సిబ్బందికంతా తెలిసిపోయింది. నగరంలో ఎక్కడికక్కడ బస్సులు ఉదయం పదిన్నర కల్లా స్తంభించిపోయాయి. రవాణా సంస్థ అధికార్లు సామరస్యం కోసం ప్రయత్నించారు. రాత్రి పద్దైంది. సామరస్యం కుదరలేదు. అధికార్లు ఎలాగో తంటాలు పడి నగరంలో అక్కడక్కడ వదిలి వేయబడిన బస్సులను డిపోలకు చేర్చుకున్నారు. మర్నాడైనా బస్సులు దొరుకుతాయని ఎదురు చూసిన ప్రజలకు ఆశాభంగమైంది. ఆటోలు, టాక్సీలు—వాటి డ్రైవర్ల దయాధర్మాలపై ఆధారపడి ఇల్లు కదుల్తే కాని పొట్ట నిండని జనం తంటాలు పడ్డారు.

## అధికార్ల బెదిరింపు

చివరికి, ఎట్టకేలకు ఏప్రిల్ 2న పనిలో చేరతారా, పనిలో నుంచి తొలగించమంటారా అని రవాణా సంస్థ అధికార్లు బెదిరించారు. మంత్రి లక్ష్మీనరసయ్యగారు కూడా జోక్యం చేసుకొని, బస్సులు నిలిపివేసినందుకు చర్య తీసుకోమని హామీ నిచ్చారు. ఆ తరువాత ఏప్రిలు 3 ఉదయం బస్సులు తిరగ నారంభించాయి.

బస్సు సిబ్బందికి ప్రయాణికులకు, ముఖ్యంగా విద్యార్థులకు మధ్య— కుక్క, ఫకీరు మధ్య వలె— ఘర్షణ జరగడం కొన్నాళ్ళుగా పరిపాటై పోయింది. రద్దీ బాగా ఉండే సమయాల్లో ఉదయం, సాయంత్రం కూడా కీచులాటలు జరుగుతూ ఉంటాయి. యువబృందమంతా ఏకమవుతే, సిబ్బంది చేయగలిగిందేముండదు. సిబ్బంది ఈ విధంగా నిత్యం ప్రమాదకర స్థితిలోనే ఉంటుంది. ఘర్షణ దెబ్బలాటకు దారి తీస్తూ ఉంటుంది. చాలామంది ప్రయాణికులు చూస్తూ ఊరుకుంటారు కాని జోక్యం చేసుకొని తప్పెవరిదైందీ చెప్పరు. వాళ్ళకూ భయమే. బస్సు నిండుగా లేకపోయినా ఒకొక్కసారి స్టాండు దగ్గిర బస్సుల నాపరు. ప్రయాణికుల సమ్మర్దం బాగా ఉంటే, వాళ్ళంతా ఎక్కి, వారిచేత టికెట్లు కొనిపించి ఆలస్యంగా చేరవలసి వస్తుందని బహుశా అలా చేస్తారు. ఇక బస్సు



స్తరంగా ఉంటే చెప్పనక్కరలేదు. ఒకొక్కసారి స్టాండుకు నూరు గజాల దూరంలో ఆపుతారు. దిగేవారిని దింపేసి త్వరగా వెళ్ళిపోదామనే ఉద్దేశంతో. బస్సు తప్ప మరో రకమైన వాహనాన్ని ఉపయోగించ లేనివారికి ఇలాంటివి చాలా చికాకును కలిగిస్తాయి. కండక్టరు కూడా క్రిక్కిరిసి ఉన్న బస్సులో టికెట్లు అమ్మి, అమ్మకాన్ని నమోదు చేసుకొని, చెక్కింగ్ సిబ్బంది బాధల నుంచి తప్పుకోవడం కోసం యాతనలు పడుతూ, ఒకొక్కసారి స్టాప్సు కోల్పోతారు. కదిలిస్తే మీద పడేట్లు ఉంటారు.

**మునలి బస్సుల అవస్థలు**

ఎంత గొప్ప వ్యవస్థ ఐనా, ఆఫీసులు విద్యాసంస్థలు తెరిచే ముందు, మూసిన తరువాత ఉండే ప్రయాణీకులను స్టాపుల నుంచి మరో స్టాపులకు చేరవేయవలసిన బాధ్యతను అందరికీ సంతృప్తికరంగా నిర్వర్తించగలగడం చాలా కష్టం. అందులో రాను రాను అవ్యవస్థ, అసమర్థత వరాకాష్ఠ నందుకుంటున్న మన రాష్ట్రంలో ఉన్న పరిస్థితి అందరికీ తెలిసిందే. రవాణా సంస్థ నిర్వాహక వర్గం ఖర్చులు పెరిగిపోతున్నాయని గగ్గోలు పెడుతూ ఉంటుంది. అందులో రాజధానీ నగరంలో రేట్లు తక్కువ. విద్యార్థులకు కన్సెషన్. ప్రభుత్వ సిబ్బందికి కన్సెషన్. పైగా ప్రయాణీకుల సంఖ్య హెచ్చు. కనుక అవసరమున్న బస్సుల సంఖ్య కూడా హెచ్చు. ఐతే రవాణా సంస్థవారి బస్సుల్లో హెచ్చు సంఖ్యలో ప్రవేశించి రిటైరు కావలసిన దశలో ఉన్నాయి. వీటి స్థానంలో కొత్త వాటిని ప్రవేశపెట్టే స్థితిలో రవాణా సంస్థ లేదు. కొత్తవి విరివిగా దొరకడం లేదు కూడా. దానికి తోడు ప్రయాణీకుల వత్తిడి పెరుగుతున్నది. ఈ పరిస్థితిలో రవాణా సంస్థకు చెడు పేరు తప్ప మంచి పేరు ఎలా వస్తుంది.

యువకుల్లో క్రమశిక్షణ లోపించిన విషయం అందరికి తెలిసిందే. వీరిలో అశాంతికి అల్లరికి అనేక సామాజికమైన కారణాలు లేకపోలేదు. పైగా యువకులంతా చెడ్డవారని ఎలా అంటాము? ఏమైనా అల్లరి చేస్తే యువకుల నుంచి టికెట్ పూర్తిగా లభించే వరకు బస్సులను నడిపించమని రవాణా సంస్థ సిబ్బంది భీష్మించడంలో అర్థంలేదు. చివరికి వారు కూడా ఆవిషయాన్ని గమనించే పనిలో మళ్ళీ చేరారు. కాని రవాణా వ్యవస్థలో అంతరాయం కలిగితే ప్రజలకు కలిగే కష్టం ఇబ్బంది మాట ఎలా ఉన్నా, దేశానికి ఆర్థిక వ్యవస్థకు కూడా హాని కలుగుతుంది.

— వి. నాగేశ్వరరావు ●



# సన్యాసరావు - స్మశానవైరాగ్యం

తల్లాప్రగడ గోపాలకృష్ణ

గళ్ళషర్టు, తెల్లపేంటు వేసుకొని జేబులో పైలట్‌పెన్ను, కుడిచేతికి 'సీకో' వి, ఎడమచేతికి అరకాసు ఉంగరం పెట్టు ఒక తరం నాగేశ్వరరావు పోజ్‌లో న్నాడు సన్యాసిరావు, కిస్మీమ్ కిళ్ళీ దగ్గర.

ఆరోజు డైలీ న్యూస్‌పేపరు ఇంకా రాలేదు...

'ఇది ఆరవసారి తను బి. ఏ. పరీక్షకు వెళ్లడం. అప్పుడే రెండు రిజల్ట్స్ చూశాడు. గజనీ మహ్మద్‌లా ఇంకా ఓపికలేదు. ప్రతిసారీకు కనీసం [illegible] మా పేరంటా రాసేడు. కనీసం పాసవుతానేమోనని ఆశ, నమ్మకం. ఏమైనా సరే, దిస్ ఈజ్ ది లాస్ట్ అండ్ ఫైనల్ అటెంప్ట్. పోతే, ఎవరికీ మొహం చూపించ కూడదు. సన్యాసరావు ఆలోచిస్తూండగా, పేపరు కుర్రాడు 'పేపరుసార్! రిజల్ట్స్ వచ్చాయి' అన్నాడు. పానకంలో పుడకలా.

సన్యాసరావు ఉలిక్కిపడి, వాడిమీదపడి, చటుక్కున పేపరు లాక్కుని, చిల్లరడబ్బు లివ్వి, టపటపా పేజీలు త్రిప్పాడు. తననెంబరు కోసం వెతికాడు. కళ్ళు మసకగా ఉన్నాయి. సన్యాసరావు కర్చీఫ్‌తో కళ్ళు తుడుచుకున్నాడు. మళ్ళీ చూశాడు. నంబరు కనిపించటంలేదు. కనబడంలేదు. కాదు, అసలు లేదు. సన్యాసరావుకు నమ్మకం కుదరలేదు. ఇంకో పేపరు కొన్నాడు. ససేమిరా కనిపించనంది. మనవాడికి మతిపోయింది. 'ఇప్పుడేం చెయ్యటం తను. ఇంటా, బయటా 'ఈసారి ష్యూర్' అని చెప్పాడే! ఇప్పుడీ ఏడుపు ముఖం ఎలా చూపించటం? ఇల్లువిడిచి, ఊరువిడిచి ఎక్కడికయినాపోతే? బాగానే ఉంది అయిడియా. మంచి పోజులో ఉన్న ఫోటో ఒకటి టేబిల్‌మీద (కనిపించేలా) పెట్టి పోతేసరి. పేపర్లో పడుతుంది. తర్వాత రెండుమూడుసార్లు రేడియోలోకూడా చెబుతారు. కానీ ... ఒక్కచిక్కుందే? మనం బయటకుపోతే కూడుపెట్టే నాథుడెవడు? అదీ ఒక సమస్యే. ఛ! వెధవది బ్రతికుంటే అన్నీసమస్యలే. చస్తే సుఖం. యస్! చస్తే సుఖం. అప్పుడు అమ్మాయిలందరూ, 'అయ్యో! ఎంత అందగాడు మిస్టర్‌రావ్!' అని, తెల్సినవాళ్ళు 'అయ్యయ్యో! ఎంత మంచివాడు పిచ్చిసన్యాసి' అని కామెంట్లు, యస్, ఈ వేళ అందరికీ 'గుడ్‌బై' చెప్పేసి, ఆ వేళ చచ్చిపోవాలి' సన్యాసిరావు తీర్మానించుకున్నాడు.

పేపరుమడిచి, చేత్తోపట్టుకొని, సైకిల్ 'లాక్' తీసాడు. వెనుక చక్రంలో గాలిపోయింది. వెధవది, పరీక్షపోయి, జీవితం పోతూఉంటే, ఆఫ్టరాల్ గాలి ఒక లెఖ్ఖా? సన్యాసిరావు సైకిల్ నడిపించుకొని సత్తిరాజు సైకిల్‌షాపు దగ్గరకు వెళ్ళాడు.

చక్రంలో గాలి కొట్టించుకొని, 'సత్తిరాజూ! ఇదే ఆఖరిసారి, నీకునాకు ఋణం తీరిపోయింది. సైకిల్‌షాపు, అదీ (?) బాగా చూస్కో' అన్నాడు.

టెర్మినేజితో బొట్టుగురించి ఆలోచించ లేదు) ఎందుకు పాడవటం, ఇవితీపి పట్టాల ప్రక్కనపెట్టితే, ఏ బీ ద వా డై నా తీసు కుంటాడు, ఆ లో చిం చి సన్యాసరావు సామాన్లన్నీ జేబురుమాల్లో కడుతూ టైమ్ చూసాడు నాల్గున్నర...'

బహుశ, ట్రైన్ వచ్చేస్తూ ఉంటుంది. సన్యాసరావు గుండె దడదడ లాడుతోంది. కళ్ళు మూసుకొని పట్టాల కడ్డంగా పడు కున్నాడు. దైవప్రార్థనలు మొదలుపెట్టాడు చిన్నప్పుడు గుర్నాథం మేష్టారు నేర్పిన కొంకిన్ని పద్యాలన్నీ చదివాడు, ట్రైన్‌మాట జ్ఞాపకంవచ్చి జేబురుమాలు విప్పి టైమ్ చూసాడు. ఎక్జాక్ట్లీఫైవ్...

ఏమిటి? ఈ వేళ, ట్రైన్ ఇంత ఆలస్యం అయ్యింది. తనది అదేం జాతకమో! అనుకున్నపని ఎప్పుడు జరుగదు. అందులో ఈ రైళ్లను నమ్ముకోవటం అంత బుద్ధి తక్కువపని మరోటిలేదు. రైల్వే డిపార్ట్ మెంటుమీద కొండంతకోపం వచ్చింది. సన్యాసరావుకి. గబగబా జేబురుమాలుమూట అందుకుని దానిలోని సామాన్లు వాటివాటి స్థానాలో అమర్చి, రైలుస్టేషన్‌కేసి నడక సాగించాడు. స్టేషన్‌కివెళ్తే నాల్గు గంటలు లేటని తెల్సింది.

సన్యాసరావుకి ఏం చెయ్యాలో పాలు పోలేదు. ఆలోచిస్తూండగా సిగరెట్‌మీదకు మనస్సు పోయింది. 'ఛవ్! ఆఖరిసారిగా ఒక్కసారి సిగరెట్‌కాల్చి ప్రశాంతంగా చావచ్చు. తర్వాత ఎల్లాగ కాల్చడాన్కి ఉండదు.' అనుకున్నాడు.

కిళ్ళీకొట్టు దగ్గరకు వెళ్ళి, ఒక గోల్డ్

# సన్యాసరావు...

ఫ్లేక్ సిగరెట్ కొని, నిప్పంటించాడు. గట్టిగా ఒక దమ్ములాగి, దగ్గర్లో గోడమీద ఉన్న సినిమా పోష్టర్‌మీదకి చిరునవ్వుతో చూపును పోనిచ్చాడు చిదానందస్వామిలా. 'మీ అభిమాన నటుడు పద్మశ్రీ...నటిం చిన చిత్రం. డెయిలీ త్రీ షోస్, సీ టుడే' అని ఉంది.

'వెధవ పిక్చర్లు, వీళ్ళూనూ. ఏదో ఒకటి డబ్బు దోచుకోడాన్కి' చచ్చేముందైనా గ్రహించినందుకు సంతోషించాడు సన్యాస రావు.

'ఇలా స్టేషన్ దగ్గర నుంచుంటే తెలిసినవాళ్ళ కెవరికేనా అనుమానం రావచ్చు. మరి ఎలా ?'

సన్యాసరావు ఆలోచించాడు:

'పోనీ, ఆఖరిసారిగా సినిమా చూసి చస్తే యేం ? ఏదో ఒకటి కాలక్షేపాన్కి' సరి పెట్టుకున్నాడు.

ఖాళీగా రిక్షా పోతూంటే కేకేసి థియే టర్‌పేరు చెప్పాడు. థియేటర్ రాగానే రిక్షా దిగి ఒక రూపాయి చేతిలోపెట్టి పంపిం చాడు. బాల్కనీ టికెట్ తీసుకుని సీట్‌లో కూర్చున్నాడు.

ముందు సీట్లో ఒక అమ్మాయి కూర్చుని ఉంది. ఒక జడ వేసుకుని మడచి కట్టు కుంది. చెవులకు రింగులు, మెడలో ఒంటి పేట గొలుసు వేసుకుంది. అఫ్ స్లీవ్‌లెస్ జాకెట్. పువ్వుల చీర కట్టుకుంది. ప్రక్క సీట్లో ఆ అమ్మాయి తమ్ముడు కాబోలు కూర్చున్నాడు. సన్యాసరావు పిక్చర్ చూడ్డం

లేదు. ఆ అమ్మాయినే చూస్తున్నాడు. ఇన్‌టర్‌వెల్‌లో లైట్లు వెలిగాయి. ఆ అమ్మాయి ప్రక్కనున్న కుర్రాణ్ని తీసుకుని బయటకు వెళ్ళింది. అప్పుడు చూసాడు సన్యాసరావు ఆమె ముఖం.

పెద్దపెట్టున ఆశ్చర్యపోయాడు.

'వాట్! నా ఎదురుగా కూర్చున్న అమ్మాయి, మా ఇంటి ఎదురుగా ఉన్న ప్రొఫెసర్‌గారిఅమ్మాయిసుగుణ. నాకెలక్కి? ఏమైనాసరే మాట్లాడాలి' అనుకున్నాడు.

సుగుణ వచ్చింది. యథాప్రకారం సీట్లో కూర్చుంటూ సన్యాసరావుకేసి చూసింది. సన్యాసరావు చిరునవ్వు విసిరాడు. సుగుణ కూడా నవ్వింది.

సన్యాసరావుకి సంభాషణ ఎలా ప్రారం భించాలో తెలియులేదు.

'పిక్చర్‌కి వచ్చారా?' అన్నాడు.

'ఔనండి, నేనూ, మా తమ్ముడు.'

నవ్వింది సుగుణ. నవ్వినప్పుడు పలు వరస తళుక్‌మంది.

'పి. యు. సి.లో క్లాస్ వచ్చిందా' ఏం అడగాలో తెలియక టాపిక్ చదువుమీదకు పోనిచ్చాడు దురదృష్టవశాత్తు.

'ఏదోలెండి. సెకండ్‌క్లాస్.'

'నెక్స్ట్ ఏం చదువుతారు?'

'బి. యే. నండి.'

'దట్స్ గుడ్.'

'మీ రిజల్ట్స్ ఏమయింది?' నవ్వుతూ అడిగింది.

'మామూలేనండి' అన్నాడు ముక్త సరిగా.

'పోనీలెండి. నెక్స్ట్‌టైమ్ బాగా చద వండి' అంది సానుభూతిగా.

ఇంతలో పిక్చర్ బిగిన్ అయింది. ఇద్దరూ మాట్లాడకుండా కూర్చున్నారు.

పిక్చర్ అయిన తర్వాత రెండు రిక్షాలు మాట్లాడబోయాడు సన్యాసరావు.

'వద్దండి. ఎందుకు డబ్బు దండగ. ఇద్దరం ఒకచోటకేగా. ఒకే రిక్షాలో పోదాం మీ కభ్యంతరం లేకపోతే' అంది చనువుగా.

సన్యాసరావు పెద్దగా సంతోషించాడు. తన అదృష్టానికి మురిసిపోయాడు. సుగుణ తమ్ముడు నిద్రపోవటం మరీ మంచి దయ్యింది.

దార్లో అనేక విషయాలు మాట్లాడు కున్నారు. (అవన్నీ ఇక్కడ రాస్తే సన్యాస రావు కోప్పడవచ్చు. మంచి మర్యాద లేదా

ఏవిటో మేకప్-నే పిండా కూడు!
ఇతనే చిత్రంలో హీరోనయ్యా!



# సన్యాసరావు...

అని.) క్లుప్తంగా చెబుతాను. సన్యాసరావు తాను సుగుణను ప్రేమిస్తున్నాను అన్నాడు. సుగుణ తానుకూడ అంతేనంది. నామింటికి నాలుగు ఇళ్ళముందు రిక్షాదిగి, సుగుణకు 'గుడ్‌నైట్' చెప్పి, నెమ్మదిగా ఇల్లు చేరుకొని, అల్లాగే మంచంమీద వాలిపోయాడు. (మనలోమాట—మరి నావుమాటేమిటి?)

* * *

'ఒరేయ్, సన్యాసీ! ఏమిట్రా ఆ మొద్దునిద్ర. తొమ్మిది అయింది. నీ పరీక్ష రిజల్ట్సు వచ్చాయి చూడు' అన్నాడు అన్నయ్య పేపరు చేతో పట్టుకొని.

సన్యాసరావు ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. తన ఒంటిమీద పంచె, బనీను తప్పితే, టెర్లిన్ జత, కాలికి బూట్సు ఏమీ లేవు. అంటే...అంటే అంతా కలన్న మాట. కలయినందుకు రిజల్ట్సు విషయంలో సంతోషించాలో సుగుణ విషయంలో ఏడ్వాలో సన్యాసరావుకు అర్థం కాలేదు.

'ఒరేయ్, మొద్దు! నెంబరెంత?' అన్నయ్య అరిచాడు.

సన్యాసరావుకు పూర్తిగా మెలుకువ వచ్చింది.

నెంబరు చెప్పాడు.

'సాధించావురా. ఇప్పుడు నీ పేరు సన్యాసరావు బి.ఏ.' అన్నయ్య నవ్వుతూ అన్నాడు.

ఒక్కసారి మంచంమీదనుంచి ఉరికి పేపరు లాక్కుని చూసాడు.

'థాంక్యూ బ్రదర్!' అన్నాడు.

అప్పుడే ఇల్లు, ఎదురిల్లు ప్రాకిపోయింది సన్యాసరావు విజయం.

త్వరగా ముఖం కడుక్కుని, గదిలో కిటికీదగ్గర నుంచుని కాఫీ త్రాగుతూ రాత్రి వచ్చిన స్మశాన వైరాగ్యంలాంటి కల గురించి ఆలోచిస్తున్నాడు సన్యాసరావు.

ఎదురింటి సుగుణ కాలేజీకివెళ్తూ సన్యాసరావును చూసి 'కంగ్రాట్యులేషన్స్' అన్నట్టుగా నవ్వింది.

'థాంక్యూ' అన్నట్టుగా నవ్వాడు సన్యాసరావు బి.ఏ. ●

పి. యస్. మోహన్

# సోవియట్ 9వ పంచవర్ష ప్రణాళిక – ఒక పరిశీలన

సోవియట్ యూనియన్ నూతన ఆర్థిక పంచవర్ష ప్రణాళికపై ప్రతిచోటా చర్చలు జరుగుతున్నాయి. ప్రణాళికకు సంబంధించిన వార్తలు, వ్యాసాలు, సంపాదకీయాలు పత్రికల్లో ప్రచురింపబడుతున్నాయి. ప్రపంచం నలుమూలల్లోని ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్తలు, ఇతర ప్రముఖులు, ప్రణాళికపై ప్రసంగాలు చేస్తున్నారు, ప్రకటనలు చేస్తున్నారు.

కాని, సోవియట్ ప్రణాళికలకు ఎందుకు ఇంత ప్రాముఖ్యత కనపర్చడం జరుగుతోంది? ప్రణాళికా వివరాలను తెలుసుకున్నంత మాత్రాన మనకు కలిగే లాభం ఏమిటి? అన్న ప్రశ్నలు ఎవరేనా అడగవచ్చు. నా అభిప్రాయం ప్రకారం దీనికి మూడు ప్రధాన కారణాలు వున్నాయి:

ఒకటి— ప్రపంచంలోని అనేక దేశాంలో సోవియట్ యూనియన్ మాటకు ఎంతో గౌరవంవుంది. రెండు— సోషలిస్టు ప్రణాళికార్థిక వ్యవస్థ అనే నూతన పద్ధతిని సోవియట్ యూనియన్ ప్రపంచానికి అందించింది. మూడవ కారణం, వర్తమాన దేశాలన్నింటికీ, ముఖ్యంగా, ఇటీవల స్వాతంత్ర్యం పొందిన దేశాలన్నింటికీ సోవియట్ యూనియన్ ఆర్థిక, శాస్త్రీయ, సాంకేతిక సహకారం అందిస్తోంది. పై కారణాలవల్ల, ప్రతి ఒక్కరూ, సహజంగా, సోవియట్ యూనియన్ గురించి, ఆ దేశ ప్రణాళికల గురించి తెలుసుకోవడానికి కుతూహల పడతారు.

సోషలిస్టు ప్రణాళికలు అంటే ఏమిటి? ఈ వ్యవస్థలో, ఉత్పత్తి, పంపిణీ విషయాలపై ప్రభుత్వమే పూర్తి అజమాయిషీ వహిస్తుంది. కేంద్ర అధికారంయొక్క ఆదేశాం కనుగుణంగా, దేశ ఉత్పాదక వనరుల కేటాయింపు జరుగుతుంది. ఉత్పత్తి మూలంగా వచ్చే లాభాలు, ఏ కొద్దిమంది ధనస్వాముల జేబుల్లోకోకాక, ప్రభుత్వ ఖజానాకు చేరుతుంది. ఆ ధనం మానవ శ్రేయస్సుకి, అతని కుటుంబానికి, అతని పిల్లలకు, ఉచిత వైద్య సౌకర్యాలు, ఉచితంగా పూర్తి విద్యా సౌకర్యాలు కలుగజేయడానికి, తీరిక వేళల్లో వినోదంగా గడపడానికి ఖర్చు పెట్టబడుతుంది. స్వేచ్ఛకు ఎటువంటి భంగం రాదు. భవిష్యత్ పట్ల ఎటువంటి ఆందోళన వుండదు. ఇటువంటి ప్రణాళికా వ్యవస్థలో, దేశ ప్రయోజనాల కనుగుణంగా ప్రతి ఒక్కరూ పూర్తి స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తారు.

అతి స్వల్ప కాలంలో సోవియట్ యూనియన్ ఆర్థికరంగంలోని అన్ని వ్యవస్థల్లోనూ బ్రహ్మాండమైన విజయాలు సాధించిన విషయం ప్రపంచానికి తెలును. దీనికి కారణం సోషలిస్టు ప్రణాళికా సూత్రాలను ధృఢమైన ఆచరణతో అనుసరించడమే. ఇంతవరకు సోవియట్ యూనియన్ 8 పంచవర్ష ప్రణాళికలను విజయవంతంగా ముగించింది. ప్రస్తుతం మరొక నూతన ప్రణాళికలో అడుగు పెట్టింది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 24 వ మహాసభ, తన ఆదేశాల ముసాయిదా ప్రాతిపదికపై నూతన పంచవర్ష ప్రణాళికను ప్రతిపాదించడానికి మార్చి నెల 30 వ తేదీన సమావేశమైంది.

ఈ నూతన ప్రణాళిక ప్రకారం ఫ్యాక్టరీ కార్మికుల, ఆఫీసు సిబ్బంది యొక్క సగటు వేతనాలు, జీతాలు 20—22 శాతం పెరుగుతుంది. గత సంవత్సరం చివరి భాగానికి వీరి వేతనాలు 122 రూబుళ్లకు చేరుకుంది. గత సంవత్సరం, జాతీయ ఆదాయం 1,93,500 మిలియన్ రూబుళ్ళనుంచి 2,75,000 మిలియన్ రూబుళ్లకు పెరిగింది. తలసరి నిజ ఆదాయాలు 30 శాతం పెరుగుతాయి. ఇది సహజంగా వారి కొనుగోలు శక్తిని పెంచుతుంది. జాతీయ ఆదాయం 37—40 శాతం పెరుగుతుంది. ప్రజలకు వివిధరకాల దుస్తులు, పాదరక్షలు, ఫర్నిచర్, ఇంకా అనేక వస్తువులు లభ్యమవుతాయి. ఇవికాక, ప్రతి సోవియట్ కుటుంబానికి తమ ఆదాయానికి అదనంగా పౌర వినియోగ నిధుల నుంచి ముడుతుంది. ప్రస్తుతం సోవియట్ యూనియన్‌లో పెన్షన్ మొత్తాలు పెరుగుతున్నాయి. పదవీ విరమణ వయస్సు అంతకంతకూ తగ్గుతోంది. పురుషులకు 60 సంవత్సరాలు. స్త్రీలకు 55 సంవత్సరాలు. మరొక ఆసక్తికరమైన అంశం తక్కువ పన్నులు. సోవియట్ యూనియన్‌లో పన్ను విధింపు అంతకంతకు తగ్గిపోతోంది. 9 వ ప్రణాళికాంతానికి పన్నులు మరింత తగ్గిపోతాయి.

ఈ నూతన ప్రణాళికలో మరో ముఖ్యమైన అంశం, వినిమయ వస్తువులకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వడం. పారిశ్రామిక రంగం నుంచి యీసారి ప్రాధాన్యతను వినిమయ వస్తూత్పత్తి రంగాని మళ్లించడం జరిగింది. కనుక యీసారి వినిమయ వస్తువుల వుత్పత్తి 7.4 శాతం పెరుగుతుంది. టెలివిజన్ సెట్లు, వాషింగ్ మిషన్లు, మోటారు సైకిళ్లు, గృహోపకరణ వస్తువుల ధరలు బాగా తగ్గిపోయాయి. వినిమయ వస్తువుల ధరలు ఇంకా తగ్గిపోతున్నాయి. కిరాణా వస్తువుల ధరలు ఎట్టి మార్పుకు లోనుకాక స్థిరంగా వున్నాయి. వచ్చే 5 సంవత్సరాల్లో పారిశ్రామికోత్పత్తి 42—46 శాతం పెరుగుతుంది.

నూతన ప్రణాళికలో వైద్య సర్వీసులు మెరుగౌపడతాయి. 30 లక్షల పడకలతో ఆసుపత్రులు అభివృద్ధి చేయబడతాయి. ప్రస్తుతం సోవియట్ యూనియన్‌లో ప్రతి 10 వేల మందికి 27 మంది డాక్టర్లు వున్నారు. ఇతర దేశాలతో పోల్చి చూసినప్పుడు ఇరాన్‌లో 3.7, టర్కీలో 3.3, బ్రిటన్ 14.7, అమెరికాలో 18.16 శాతం మంది డాక్టర్లు వున్నారు. మొత్తం ప్రపంచంలో వైద్య సర్వీసులు ఉచితంగా లభ్యమయ్యే దేశం ఒక సోవియట్ యూనియన్ మాత్రమే. సెలవు శిబిరాలు, ఆరోగ్య శిబిరాలు మరింత మెరుగుపర్చబడతాయి.

మరొక ముఖ్యమైన రంగం విద్య. ఈ ప్రణాళికలో 9 మిలియన్ల మంది బాలబాలికలు ఉచిత, ఉన్నత లేక ప్రత్యేక మాధ్యమిక విద్యను పొందుతారు. 6 మిలియన్‌ల మంది పిల్లలకు విద్యాలయాలను నిర్మించాలని నిర్ణయించబడింది. 8వ

(64 వ పేజీ చూడండి)



# ఎన్నికల తర్వాత రాజధాని ఢిల్లీ

ఈసారి ఎలక్షన్లు చాలా సీరియస్‌గా జరిగాయి. ఈ ఎన్నికలవల్ల శ్రీమతి గాంధిగారి నాయకత్వాన్ని ప్రజలంతా ఏక గ్రీవంతో ఆమోదించినట్లు తేల్చిపోయింది. బాగానేవుంది. కాని, మనదేశం పార్లమెంటు చరిత్రలో జరగని దొకటి ఈసారి జరిగింది. అదేమిటంటే — ఇప్పుడు బలమైన ప్రతిపక్షం లేదు, గ్లామరూ లేదు.

అయిదవ లోక్‌సభ సమావేశం జరిగిన మొదటిరోజున అది పార్లమెంటు అనిపించ లేదు. ఏదో ఇన్సూరెన్సు కంపెనీ జనరల్ బాడీ మీటింగనిపించింది!

**మళ్ళీ ఆ రోజులు రావు !**

పూర్వం రోజులు మళ్ళీ రావు. పార్లమెంటు సెంట్రల్ హాలు ఇదివరకటిలా కళ కళలాడుతూ వుండదు. అందుకు కారణం ముఖ్యంగా శ్రీమతి తారకేశ్వరీ సిన్హా. తారకేశ్వరీసిన్హా ఎప్పుడూ కొందరు జర్నలిస్టుల్ని చుట్టూ వేసుకుని అనర్గళంగా జోకులు కట్‌చేస్తూ వుంటుంది. ఆమె వున్న చోటున నవ్వులు విరబూస్తూ వుంటాయి. ఇప్పుడామె స్థానం ఖాళీగా వుండి వెల వెలబోతున్నది. ఇక ఆచార్య కృపలానీగారి సంగతి సరేసరి. వెనకా ముందూ ఆలోచించకుండా కుండబద్దలు కొట్టేసేవారు. వారి స్థానమూ ఖాళీగానే వుంది. 'కహాఁభాంయీ' అంటూ అందరి దృష్టినీ ఆకర్షించే డా. రామ్‌సుభాగ్‌సింగ్ ఇప్పుడు లేరు. విడవకుండా కిళ్లీ వేసుకుంటూ ఎర్రని పెదవుల్లోనుంచి తెల్లగా నవ్వుతూవుండే అశోకమెహతాగారు ఇప్పుడు మనకు కనిపించరు. మసానీ, రంగా, మధు లిమాయేల్లాంటి వక్తలు పార్లమెంటులో అడుగుపెట్టడానికి అవకాశం లేకపోయింది.

**గ్లామరు తగ్గిన పార్లమెంటు**

ఇప్పుడు మన పార్లమెంటు పైనచెప్పిన వ్యక్తుల్ని పోగొట్టుకొనడంతోపాటు మరింత గ్లామర్ని కూడా పోగొట్టుకుంది. పార్లమెంటులో స్త్రీల స్థానం ఇంత తక్కువగా ముందెన్నడూ లేదు.

మూడవ లోక్‌సభకి 36 గురు స్త్రీలు వచ్చారు. నాల్గవ సభలో ఆ సంఖ్య 32 కి తగ్గిపోయింది. ఇప్పటి లోక్‌సభలో స్త్రీల సంఖ్య 17 మాత్రమే! (మొదటి రెండవ లోక్‌సభల్లో ఈ సంఖ్య 21, 26 చొప్పున వుంది) మన ప్రధానిగారు కూడా ఈ సంఖ్యలో వున్నారు.

**స్త్రీల మెజారిటీ**

ఈసారి 63 గ్గురు స్త్రీలు మాధ్యంతర ఎన్నికల్లో పోటీ చేశారు. ఇందిరా కాంగ్రెసులో ఈ సంఖ్య పెద్దది. పదముగ్గురు ఎన్నికయ్యారు. (ప్రధాని కాక). తక్కిన పార్టీలు 29మ్మందుగురు స్త్రీలవరకు నిలబెట్టారుగాని వారిలో గాయత్రీదేవి (స్వతంత్ర) గ్వాలియర్‌రాజమాతా (జన సంఘ్) మాత్రమే ఎన్నికయ్యారు. మరో 21 మంది స్వతంత్రులుగా నిలబడ్డారు. కాని, జోధ్‌పూర్‌రాజమాతా మాత్రమే గెలవగల్గారు !

49 శాతం వరకు స్త్రీలు ఎన్నికల్లో పోటీ చేశారు. కాని, వారిలో 3 అక్షరాలా మూడు శాతం మాత్రమే లోక్‌సభకి వచ్చారు. మొత్తం 18 రాష్ట్రాలలోను అస్సామ్, ఆంధ్రా, బీహార్, మధ్యప్రదేశ్, యు.పి; మైసూర్, ఢిల్లీ, రాజస్థాన్‌ల నుంచి మాత్రమే స్త్రీ అభ్యర్థులు పోటీ చేశారు.

ఎన్నికయిన 17 మందిలోను ముగ్గురు మాత్రమే లోక్‌సభలో స్థానం సంపాదించుకో గలిగారు. వారు: ఢిల్లీకి చెందిన శ్రీమతి ముకుల్ బెనర్జీ. లక్నోనుంచి శ్రీమతి శీలా కౌల్. (మంచి సుస్వరద్రూపి. కమలా నెహ్రూగారి అన్నగారి భార్య. ఇందిరమ్మగారికి చాలా దగ్గర చుట్టం!) జోధ్‌పూర్ నుంచి రాజ్‌మాతా క్రిష్ణకుమారి. బీహార్ నుంచి కుమారి కమలాకుమారి. ఈమె వయస్సు 32ఏళ్ళు. అందరికంటె చిన్నవారు. అవివాహిత!

**టెలిఫోన్‌తో మంత్రి పదవి**

ఈసారి ఎవరెవరు మంత్రి వర్గంలో వుంటారు—అన్న విషయం చివరి నిమిషం వరకు తెలియదు. ముందుగా శ్రీమతి గాంధీ జగ్‌జీవనరాం, చవాన్‌గారిని కలుసుకుని బాగా చర్చించారు. కాని, చర్చించి నిర్ణయానికి వచ్చినవారు లిస్టులో లేరు!



ఢి[illegible] సమితివారి ఉగాది వేడుకల సందర్భంగా సమితి సభ్యులు అల్లూరి సీతారామరాజు : శ్రీయుతులు [illegible]

ఇది విచిత్రం. మంత్రులుగా స్వీకరించిన నాయకులకి. టెలిఫోన్‌లమీద సమాచార మందించారట శ్రీమతి గాంధీ!

ఒకసారి 1967లో కూడా ఇలాగే జరిగింది. శ్రీమతి గాంధీ పార్లమెంటు అధికారానికి రాగానే తన మంత్రివర్గంలో ఎవరుండాలి? అన్న విషయం మీద పెద్దపెద్ద వాళ్ళనంతా సంప్రదించారు. ఆ చర్చల్లో ముఖ్య మంత్రులు పార్టీనాయకులూ వున్నారు. ఈసారి అదేమీలేదు. కారణం? ఇప్పుడామె ఏ నిర్ణయం తీసుకున్నా అడిగే వారు లేరు. ఆమె పట్టమహిషి, సర్వ సామ్రాట్!

**వయసు మళ్ళిన యువరక్తం :**

యువతరం రావాలి, యువరక్తం చేరాలి — మంత్రివర్గం ఉత్సాహంగా పని చెయ్యాలి అనేది శ్రీమతి గాంధీ నినాదం. ఇప్పటి లోక్‌సభ పరిస్థితి చూస్తుంటే యువ రక్తం అంటే అర్థమేమిటో తెలియడం లేదు. కొత్త లోక్‌సభ మంత్రివర్గాన్ని చూడండి: మంత్రుల సరాసరి వయస్సు 51. నిజం! క్రితం సంవత్సరం కంటె రెండేళ్ళు తక్కువ! ఇదేనా యువరక్తం అంటే?

**పెరిగిన పూల వర్తకం**

ఇప్పుడు ఢిల్లీలోని పూల వర్తకులు ఇందిరమ్మగారి ధర్మమా అంటూ ఎంతో సుఖంగా బ్రతుకుతున్నారు. పూల సంబంధమైన వర్తకం పుష్కలంగా జరుగుతున్నది. ఈమధ్య శ్రీమతి గాంధీగారికి కొన్ని టన్నుల పూలు వచ్చాయి! ఈ పూల వర్తకానికి కూడలి చాందినీ చౌక్. కొందరు తెలివైన వాళ్ళు శ్రీమతి గాంధీ యింటి ముందే దుకాణాలు తెరిచారు. రెండు చేతులా ఆర్జించారు.

**పాతమంత్రులు–పార్టీ సేవ**

పార్లమెంటు నుంచి వైతొలగిన చాల మంది మంత్రులు ప్రయివేటు ఇళ్ళకోసం గాలిస్తున్నారు. వారంతా ఇక్కడే వుండిపోయి పార్టీకోసం పాటుపడాలని నిశ్చయించుకున్నారు. ఇదివరకు ప్రభుత్వం ఏర్పరచిన యిళ్ళకంటె పదిరెట్లు ఎక్కువగా వీరికి ఖర్చు తగిలిందన్నమాట!

మార్చి నెలాఖరుకల్లా ఓడిపోయిన సభ్యులు యిళ్ళు ఖాళీచేసి కొత్తవారికి ఇవ్వాలి. ప్రస్తుతానికి కొత్త సభ్యులు లోడీ హోటల్‌లో 150 గదులు ఆక్రమించుకుని వున్నారు. కొందరు రంజిత్ హోటల్‌లో వున్నారు. రెండూ ప్రభుత్వానికి చెందినవే. హోటల్ రేట్లు ఎలా వున్నా సభ్యులు మాత్రం నెలకు వంద రూపాయలు మాత్రమే చెల్లిస్తారు. తక్కినది ప్రభుత్వం భరిస్తుంది.

*    *    *

అయిదుగురు కొత్త మంత్రులు 'టైప్ 8' (పెద్ద తరగతికి చెందిన భవనాలు) భవనాల్లో నివాసం ఏర్పరచుకున్నారు. వారి వారి అభిరుచులకి తగిన విధంగా ఆ భవనాల్లో ఏర్పాట్లు చేసుకున్న తర్వాత కాపురం పెడ్తారు.

**ముఖ్యమైన మాజీ మంత్రులు**

తగ్గింపబడిన మంత్రులు మాత్రం అప్పుడే ఇళ్ళను ఖాళీ చెయ్యవలసిన అవసరం ఏర్పడదు. మాజీ మంత్రులుగాను ముఖ్యమైన పార్లమెంటు సభ్యులుగాను వారిని గుర్తించి వారికి పెద్ద భవనాల్ని కేటాయించారు. కాని ఖర్చులకి ప్రభుత్వం బాధ్యతలేదు. స్వయంగా భరించుకోవాలి. ఈ ఖర్చులు తట్టుకోలేక వారెలాగూ ఆ యిళ్లను ఖాళీ చేసేస్తారు!

**అంచనాలు – హంసపాదులు**

'పత్రికలకు చాలా ఆశాభంగం కలిగింది' అన్నారు ఈ మధ్య మాట్లాడుతూ శ్రీమతి గాంధీ. ఈ ప్రస్తావన శ్రీమతి గాంధీ ఘనవిజయాన్ని పురస్కరించుకొని వచ్చింది.

జర్నలిస్టులేకాదు, ఎన్నికల పరిశీలకులు, జ్యోతిష్కులు చాలమంది ఈ విషయంలో తప్పులో అడుగువేశారు. శ్రీమతి గాంధీకి ఇంతపెద్ద మెజారిటీ వస్తుందని ఎవరూ వూహించలేకపోయారు. మహావస్తే 285 సీట్లు రావొచ్చు ననుకున్నారు.

**సైన్సును జయించిన ఇందిరాగాంధీ :**

ఈ విషయంలో సైన్సు లెక్కలుకూడా తప్పు అంచనా వేశాయి. ఒక అమెరికన్ ప్రొఫెసర్‌గారు కంప్యూటర్‌మీద లెక్కలు వేశారు. ఆ కంప్యూటరు శ్రీమతి గాంధీకి 182 సీట్లు మాత్రమే వస్తాయని చెప్పిందట!

కాని, ఒక యిద్దరున్నారు. వారు చాలా కరెక్టుగా అంచనా వేశారు. వారిలో ఒకరు ప్రధాని సెక్రటరీ శ్రీ పి. ఎన్. హక్సర్. మధ్యంతర ఎన్నికలు జరపాలని అనుకుంటున్నప్పటి నుంచి ఆయన కొన్ని లెక్కలని వేస్తూ వచ్చారు. శ్రీమతి గాంధీకి కనీసం 310 సీట్లు వస్తాయని ఆయన లెక్క. లెక్కల్లో ఆయన దిట్ట అనే అనిపించుకున్నారు!

లెక్కలని సరిగ్గా చెప్పిన మరో ప్రాణి జె. సి. బాహల్. ఆయన ఒక బ్యాంక్‌లో పని చేస్తున్నారు. మంచి జ్యోతిష్కులు కూడాను. రాయ్ బెరేలీలో శ్రీమతి గాంధీకి ఒక లక్షమెజారిటీ వస్తుందనీ, లోక్‌సభలో ఆమె పార్టీకి మూడింట రెండువంతుల మెజారిటీ వస్తుందనీ, ఆమె తిరిగి భారత దేశాన్ని అయిదేళ్లవరకు నిరాటంకంగా పాలిస్తుందనీ జోస్యం చెప్పారు. ఫలితాలు తెలిశాక ఆయన పేరుమోగి పోయింది!

—**తిరుమల్ల వెంకటనారాయణ**



# పరివర్తన

మల్లవరపు సూర్యకాంతం




ఆర్ట్సు కాలేజీ యూనివర్సిటీకి కొంచెం దూరంగా ఉంది. మధ్యలో లైబ్రరీ ఉంది.

నవంబరునెల. చలి లేదంతగా. మంజుల, నిర్మల, సుధ విజయ క్లాసుమేట్సు బి. ఎ. లో. రమణిమాత్రం బి. ఎ. లిటరేచరయినా విజయకి ముఖ్యమైన స్నేహితురాలు.

క్లాసు జరుగుతుండగానే ప్యూనువచ్చి ఆమెకోసం ఎవరో వచ్చారని చెప్పేడు విజయ నుద్దేశించి. విజయ లెక్చరర్ని అడిగి బయటికి వచ్చింది. లాను దగ్గర స్కూటరుతో విశ్వం నిలబడ్డాడు.

ఆమెనుచూసి 'విజ్జీ! బావ వచ్చేడు' అన్నాడు చెల్లెలి ముఖంలోకి చూసి. ఆమె ముఖంలో ఏమార్పు కనబడలేదు. ఏ భావనా లేదు.

'మీ ఇద్దరిమధ్య ఏ ఆలోచనలున్నా, నీవు మాత్రం ఇంటికి త్వ ర గా రా' అనేసి స్కూటరు స్టార్టు చేసేడు జవాబుకోసం ఎదురు చూడకుండానే.

పుస్తకాలు పట్టుకొని విజయ కాలేజి వెనక భాగానికి వచ్చి కూర్చుంది ఒంటరిగా. గతంలోకి వెళ్ళింది మనస్సు.

తాను అందగత్తెననే. గర్వం విజయలో బాగా పేరుకున్నది అప్పుడు. బి. ఎ. ఫస్టియర్‌లో ఉండగ ఎవరో తన్ను చూడ్డానికి వస్తున్నారని అంతా అట్టహాసం చేసేరు ఇంట్లో. తనకిమాత్రం అప్పుడే పెళ్ళిచేసుకోవాలని లేదు. అయినా తన పెళ్ళి అయితేగాని అన్నయ్యపెళ్ళి కాదు.

అతను వంటరిగానే వచ్చేడు. బి. ఎ. ప్యాసయి ఏదో ప్రయివేటు కంపెనీలో అసిస్టెంట్‌గా ఉన్నాడు. చూపులు అయ్యాయి. అతనిలో ఏ లోపములేదు. గాని—తన మనసెందుకో అతన్ని చేసుకోడానికి తిరస్కరించింది.

నచ్చకపోవడానికి కా ర ణ ం అడిగేరు అందరూ ఇంట్లో. జవాబులు చెప్పలేక అతన్ని చేసుకోడానికి ఒప్పుకుంది తను. పెళ్ళి అయిపోయింది.

ఆరోజు...వెన్నెలరోజు...వధువుకి వసంతం చిలికేరోజు—కన్నెపిల్లకి... వరుసం ఉరకలు వేసే రోజు—తనని అతని సన్నిధికి పంపడానికి సన్నాహాలు అవుతున్నాయి. కాని తన మనస్సు మాత్రం కించిత్ చలనంలేదు. ఏ కోశానా సంతోషం లేదు.

విజయ తలుపు దగ్గర నిల్చుంది. **జుటులుపై మల్లె పూలచెండతో లేతగు**

తుంపుతూ విజయవైపు చూసేడు.

విజయ కదల్లేదు అక్కడ్నుంచి. ఆమెకు దగ్గరగావచ్చి బుజాలపై చేతులువేసి ప్రేమతో 'విజ్జీ' అంటూ పిల్చి దగ్గరగా తీసుకోబోయాడు.

విజయ అతని పట్టునుండి దూరంగా జరిగింది. పెదవులపై నవ్వుగాని, ఆలస గాని, కళ్లలో సంతోషంగాని మచ్చుకైనా కనబడలేదు రామానికి.

క్షణంసేపు ఆలోచించి 'ఈపెళ్లి ఇష్టం లేదా?' అన్నాడు భారంగా. ఆమె జవాబు ఇవ్వలేదు. రామంలో ఒక్కసారిగా ఆశలన్నీ కుప్పలా కూలిపోయినట్లు, బ్రతుకంతా చీకట్లు అలుముకొన్నట్లు ఫీలయ్యాడు.

'చెప్పు భయం లేదు. ఆమూడు ముళ్లు వేసేసేను. ఎవరైనా చేసేది ఏమి లేదిక. మనలో మనం ఏడ్వడం తప్ప—'

'నేను వద్దనే చెప్పేను. పెద్దవాళ్ల ముచ్చట్లేతప్ప, ఇవతలివాళ్ల ఉద్దేశాలు వాళ్లకి అక్కర్లేదు' అంది విజయ నిర్లిప్తతతో.

రామం గట్టిగా నిట్టూర్పు వదిలేడు. ఆ నిట్టూర్పు హృదయంలోని కోటి కోర్కెలను, ఆశల్ని కాల్చివేసిన మంట తాలూకు వేడిగాలి.

'అయినా, నువ్వు నేను లోకం దృష్టిలో భార్యాభర్తలం. కనీసం ఈమూడు రోజులయినా ఈగదిలో కలిసి బ్రతకాలి. తదుపరి కాలమే నిర్ణయిస్తుంది. తల్లిప్రేమను పొందలేదు పసితనంలో, వయస్సులో భార్య ప్రేమకికూడ అర్హుణ్ని కాలేకపోయాను. ప్చ్... నాలాంటి దురదృష్టవంతుడు ఎవరైనా ఉంటారా? నేనేమయినా తప్పుచేస్తే మన్నించు...' అన్నాడు రామం అన్యమనస్కుడై.

విజయ అతని వేదనని వింది. గాని ఖర్మ!... ఆమె మనస్సు ఆ మాటలకైనా చలించలేదు. రామం దిండుతీసి చాపమీద పడేసేడు పడుకోమన్నట్లు.

అలా మూడురాత్రులు గడిచిపోయాయి. సంగతి ఇంట్లో ఎవ్వరికీ తెలియదు. రామం బాధనంతా హృదయంలోనే దాచుకున్నాడు. ఎక్కడా అనలేదు బయటికి. విజయలో ఏదో సంచలనం—ఒకమూల పట్టుదల. రెండిట మధ్య నలిగింది హృదయం. రెండునెలలు శూన్యమాసం పోయాక విజయే బయట పెట్టింది. అతనిదగ్గరకు వెళ్లడం తనకిష్టం లేదని. కూతుర్ని విందించడం ఇష్టంలేని ఆ మాతృమూర్తి తనఖర్మనే తిట్టుకుంది.

విశ్వంకి మాత్రం బావంటె చాల అభిమానం. రెండుసార్లు దగ్గరుండి తీసుకొచ్చేడు. ఆప్యాయత ఆదరణ లేకున్నా అతను అత్తారింటికి వచ్చేడు. అతనిలో ఏమూలో ఆశఉంది. ఆ ఆశే రప్పించింది అతన్ని. మంచి చీర సెలక్టుచేసి తెచ్చేడు రామం భార్య కోసం. తను విసరికొట్టింది. కాలేజీలో చేరింది మళ్లీ. ఇంతలో అన్నయ్య పెళ్లి అయి వదిన వచ్చింది.

ఆయన రావడం ఇది మూడోసారి... రమణి విజయ దగ్గరకి వచ్చింది.

'ఏం రాణీ! ఇక్కడ కూర్చున్నావు? ఏదో విశేషముండాలి.' అంది నవ్వుతూ.

'ఎక్కడ అనకు. ఆయన వచ్చేరని అన్నయ్య వచ్చి చెప్పేడు. నాకు వెళ్లాలో మానాలో తెలియడం లేదు.' అంది గడ్డి పరక నములుతూ.

'విజయా! నేనోమాట అంటాను ఏమనుకోకు అంత ఇష్టంలేనిదానివి ఎందుకు పెళ్లాడేవే?...'

'నేవద్దన్నా వింటేగద నామాట—వా మిటో అతనంటె...ఏమీ కాదు...ఇహ నేను చెప్పలేను.' అంది లేస్తూ.

'ఏది ఎలాగున్నా బాగుండదు. ఇలా మాత్రం వెంటనే వెళ్లు. స్త్రీకి జీవి వివాహం అంటూ జరిగితే అది ఒక్కసారి జరిగిన [illegible]

# ఓం నమః శివాయ

కం. సోమశేఖరా, మధీరా
సోమనాథా స్మరింతు సదా సర్వేశా నిన్
సోమేశా, భూతేశా,
సోమేశ్వరా, సురేశా, సన్నుతింతు ప్రాశీ.

కం. సోమయ్యా, సృష్టించి తేలయ్యా
సోమప్రభో సహించలేనయ్యా సంసార సాగరమున్
సోమా ధవళ ధామా
సోమపాదా, సాధింతువా సృష్టోపేషిత,

కం. సోమన్నా, సిపే మనిన
సోమదేవా, విశాకరా విభూతి
సోమాయ, హిమాయ
సోమవారిణ, బాధనాశన భూషింతున్.

కం. సోమప్రభో తప్పు నాదయ్యా
సోలిపోతినయ్యా, పరీక్షించక రక్షింపు
సోమరిగాను, సుమతి
సోషవచ్చె, సౌమ్యసిల్లితి, వంతిదానై చలించితిన్.

రచయిత్రి: అనామధేయ

(ఇంతకుముందు 'శివభక్తురాలు' పేరుతో గేయాలని రాసిన ఈ రచయిత్రి భారతదేశంలో అందరికి తెలిసిన వ్యక్తి. వారు తమ గేయాలని 'అనామధేయ' పేరుతో ప్రచురించవలసిందిగా కోరటంవలన ఆ విధంగా వేస్తున్నాము. —సం॥)

నిస్తుంది: జాలి విలువ అతి పవిత్రమైనది. వాడుముళ్లతోనే మూడు కాలాల జీవితం ముచ్చట్లతో నిండుతుంది.'

'అతనంత అందంగా ఉండరు?'

చిన్నగా నవ్వింది రమణి. 'అందం అనే పదానికి అర్థం ఏమిటి? ఏది కొలబద్ద? మనం చూసే కంటిలోనే దృష్టి లోపం ఉంది. ఏకోణం నుంచి మన మనస్సుని కేంద్రీకృతం చేసుకుంటె ఆ కోణమే బాగు లేకున్నా, అది మన మనస్సుకి అందంగా కన బడుతుంది. అంతా మనస్సులో ఉంది. నన్నడిగితే నీ మనస్సుని మార్చుకో విజయా! అతను అందగాడు కాదుగాని కురూపి కాడుగా?... 'అతన్ని చూస్తే ఒక్కొక్క సారి చిన్న పిల్లల్ని చూసినట్లుంది' అన్నాను ఇదివరకు. అదే—భార్యగా ప్రేమించి అనురాగం పంచిపెట్టు. పసివానిగా లాలించి, ఆదరించి బుజ్జగించు.' అంటూ తన అను భవంలోని విషయాల్ని కూడ విప్పి చెప్పింది రమణి. రమణి మాటల్ని విని ఆశ్చర్య పోయిందీసారి.

'అయితే, నీవు అందంలేని వాడన్నైనా చేసుకుంటావా?'

'ఏం ఎందుకు చేసుకోకూడదు? నాకు మంచి మనస్సుగల వ్యక్తి కావాలి. భార్యను ప్రేమించి ఆదరించే భర్తగావాలి. అవే నాకు ముఖ్యం.'

ఇంతలో పదో నెంబరు బస్సు వచ్చింది.

# పరివర్తన

విజయ ఎక్కింది. రమణి లైబ్రరీ వైపు నడక సాగించింది.

ఆయన గుమ్మంలోనే కూర్చున్నారు పేపరు చదువుతూ.

తన్ని చూసి, పలకరించుకున్నారు వెంటనే. విజయ సరాసరి గదిలోకి వెళ్లిపోయింది

'రామం! లే నాయనా భోజనానికి.' అంటూ శాంతమ్మ అల్లుడ్ని ఆప్యాయంగా పిల్చింది.

'ఏం బావా! నీలాటి బావగార్ని పొంద గల్గడం మా అదృష్టమనుకోవాలి.' అని స్నేహపూర్వకంగా బావగార్ని తీసుకొని వెళ్లేడు విశ్వం.

వాళ్ళందరి ఆదరాభిమానాలకి చలించి పోయాడు రామం. కాని హృదయం దేన్నయితే వెతుక్కుంటూ వచ్చిందో అది దొరక లేదు.

ఆ సాయంత్రం హైద్రాబాదు వెళ్లి పోడానికి నిశ్చయించుకున్నాడు రామం. ఆ మాట విని విశ్వం,

'మరో రెండు రోజులుండు బావా! సర దాగా గడుపుదాం. నేను సెలవు పెడ్తాను' అన్నాడు. రామం హృదయం నుండి వేడి నిట్టూర్పు వచ్చింది బయటికి.

'ఇక్కడికి రావాలనుకుంటాను అప్పుడప్పుడు. కాని వచ్చేక మనసేమిటో చెదిరిపోయి ఉన్న ఆనందాన్నీ, ఉత్సాహాన్ని కూడా మింగే స్తుంది.'

'జీవితంలో అదృష్టం కలిసివచ్చినా, అనుభవించలేని అభాగ్యులెందరో ఉన్నారు. నీ బాధ నాకు తెలుసు బావా! అమ్మ చెల్లి జీవితాన్ని తలుచుకొని ఏడ్వడం లేదు. నీమంచితనం, నీస్థితిని తలచుకొని ఏడు స్తున్నది.'

రామం కళ్లలో నీళ్లు వచ్చేయి. ముఖం చాటుగా చేసుకొని కళ్లొత్తుకున్నాడు. విశ్వానికి అతని స్థితిని చూస్తే జాలి వేసింది.

రామం ట్రైనుకి వెళ్తూ కమలతో చెప్పడానికి గదిలోకి వచ్చేడు. అక్కడే కమల, విజయ ఉన్నారు.

'వెళ్తున్నాను చెల్లాయ్!' అన్నాడు నెమ్మదిగా. హఠాత్తుగా విజయ చూపులు రామం చూపులు ఢీకొన్నాయి.

'మీరు మాత్రం రావడం మానేకండి... మా అందరి కోసమన్నా మీరు రాక తప్పదు.' అంది కమల. 'అలాగే, ప్రయ త్నిస్తాను' అనేసి క్షణం పాటు గుమ్మం దగ్గర ఆగేడు. 'మరి వెళ్తాను.' అన్నాడు. ఎవరికో ఉద్దేశించి చెప్పినట్లుగా ఉన్నాయి ఆ మాటలు.

* * *

తిరిగి వచ్చిన రామంకి మనసు గాయ పడింది. ఇల్లు బావురుమంది. ఇంట్లో, గుండెల్లో చీకటి చోటు చేసుకుని కూర్చుంది. రోజురోజుకీ అతనిలో ఏదో నిర్లిప్తత, ఏదో బాధ గూడుకట్టుకో సాగేయి. స్నేహితుల బలవంతం వల్ల తప్పనిసరి వచ్చిన చోట్లకి తిరుగుతున్నాడు. కాని ఎక్కడా మనశ్శాంతి దొరకలేదు

అఖరికి నల్లని సీసాయే శరణ్యమయ్యింది రామంకి. అందులోనే సుఖాన్ని, తృప్తిని పొందసాగేడు. రామం స్థితినిచూసి ఆఫీ సులో కొందరు విచారించేరు. వ్యసనానికి అలవాటు పడినందుకు స్నేహితులు కొందరు సంతోషపడ్డారు.

ఏది ఏమయినా రామం చూడని 'బార్' లేదు జంటనగరాలలో. తిట్టేవాళ్ళు లేరు. వద్దనేవాళ్ళు అంతకన్నా లేరు. ఏడ్చే తల్లి లేదు. ఇంక ఎవరికి కావాలి తను?...'అను కొన్నాడొకరోజు.

కాని—'నేమన్నాను. వద్దన్నయ్యా!...'



# ఇతర డస్ట్ టీల అన్నిటికంటె ఎక్కువ కప్పుల టీ ఇచ్చును

నేడే వాడి చూడండి ఇతర డస్ట్ టీలన్నింటికంటె ఎక్కువ కప్పుల టీ లిప్టన్ రూబీ డస్ట్ టీ ఇచ్చును. అంతేకాదు, రూబీ డస్ట్ టీ నుండి చిక్కదనము, సువాసనగల టీ కప్పులను అతి త్వరలో పొందగలరు. అందుచేతనే లిప్టన్ రూబీ డస్ట్ టీ "డస్ట్ టీలలో చక్రవర్తి" అనుటలో విచిత్రమేమియులేదు.

## లిప్టన్

# రూబీ డస్ట్

## డస్ట్ టీలలో చక్రవర్తి






లిప్టన్స్
అంటే
మంచిటీ

ప్యాకెట్లలోవున్న టీ మాత్రమే తాజాతనము సువాసన నిలచివుండును

# పరివర్తన

అంది ప్రక్కింటి శారద.

శారద ఉమన్స్ వెల్‌ఫేర్‌లో క్లార్క్‌గా పనిచేస్తున్నది. ఆమెకో తల్లి తమ్ముడు ఉన్నారు.

రామం, ఉనికిని, క్షేమాన్ని అడిగి తెలుసుకొనేది ఆ అమ్మాయి ఒక్కతే.

మత్తుగా తాగిన్నాడు రామం ఇంటికి రావడం లేదు. కాని—అనుకోకుండా ఒక రోజు రామాన్ని స్మృతుడుని తెలివిలేని స్థితిలో ఇంటికి చేరవేశారు ఎవరో. శారద కళ్లలో నీళ్లు వచ్చేయి ఆ రోజు అతని స్థితిని చూసి.

చెయ్యి పట్టుకొని తీసుకెళ్లి లోపల పడుకో బెట్టింది శారద.

రామం లేచి కూర్చుంటూ 'చూడు పిల్లాయ్! నేను...తాగానా? ఎప్పుడు? ఆ, తాగేను. అందులోనే ఉంది సు...ఖం... అంతా సుఖం...ఏ ఆలోచన...లు రావు. బలే...మందు. నా కెవ్వరున్నారు? తల్లి ఉం...దా? చచ్చింది ముసల్ది—భార్య హా...భార్య...నన్నుచూస్తేనే...అసయ్యం.. హ హ—నేను అందంగా లేనుకదూ?... చెప్పు—శారదా!' అంటూ చిన్న పిల్లాడిలా జాలిగా అడుగుతున్నాడు. అంతలోనే దోసిట్లో ముఖం దాచుకొని వలవల ఏడ్చే శాడు.

శారద అతని చేతుల్ని తప్పించి 'వదిన వస్తుంది. నీ విలా దిగజారిపోతె ఎలాగ? ..' అంది నెమ్మదిగా.

'హా హా—రాదు...వచ్చేదయితే...నేనెన్ని సార్లు వెళ్లినా, పలకరించనుగూడ పలక రించలేదు. ఎంతో ఆశతో వెళ్లేవాడిని... నిరాశతో మనస్సులేని మరబొమ్మనై... వస్తున్నాను. అంతే... నా బ్రతుకింతే. నీ కెందుకమ్మా నామీద ఇంత ప్రేమ?...'

శారద హృదయం అతని మాటలకి వెన్నలా కరిగిపోయింది.

'నాకు అన్నయ్య ఉన్నా నీలా ఉండడేమో అనిపిస్తుంది. చూడు—అన్నం తిను లేచి. నీకోసం బెండకాయకూర తెచ్చేను' అంది.

'వద్దు శారదా! నన్నిలా పడుకోని. నీ చేతివంట రేపు తింటాను. నాకేదోలా ఉంది. వెళ్లి పడుకో...'

విధిలేక శారద కాసిని పాలు కలిపి ఇచ్చింది. అవి తాగి పడుకున్నాడు.

శారద తలుపు దగ్గరసా లాగి వెళ్లి పోయింది. పనివాడు తలుపు వేసుకున్నాడు.

పడుకోగానే నిద్రపట్టేసింది రామంకి ఆ రాత్రి. అలా పట్టడంకోసమే తాగు తున్నాడు. కొద్దిగంటలయినా, ఆలోచనల్ని, బాధల్ని అవతలికి నెట్టి బాహ్యప్రపంచంతో సంబంధం లేనట్లుగా హాయిగా నిద్రపోవచ్చు ననుకొన్నాడు. ఆ అలవాటు నిత్యావసరమై పోయింది. వదలలేని వ్యసనమై కూర్చుం




దిప్పుడు. ఆనాటి స్నేహితులంతా తప్పు కున్నారిప్పుడు.

రామానికి మేనేజరుగా ప్రమోషను వచ్చింది. అతని నిజాయితీ అతని సత్ప్ర వర్తన—అతని జీవనప్రవాహాన్ని పెంచి, ఉత్తమవ్యక్తిగా నిలబెట్టింది.

కాలగర్భంలో రోజులు దొర్లిపోతున్నాయి. సృష్టి కల్పించే విచిత్రమైన నైపుణ్య కల్పనకు మానవులు ఎంతవరకు కారకులు? అని ప్రశ్నిస్తే జవాబు ఎవరు చెప్తారు?...

విజయకి ఆ రోజు మనస్సంతా ఏదో చికాకుగా ఉంది. కారణం ఇంటిలోని వ్యక్తులే కావచ్చు. బాహ్యప్రపంచమే కావచ్చు. రమణికి పెళ్లి అయ్యింది. అతను మద్రాసులో మెడికల్ ఫర్మ్‌లో పని చేస్తు న్నాడు. ఇద్దరు తన ముందునుంచే పలక రించకుండానే వెళ్లిపోయారు.

ఇంటికి రాగానే కాఫీ ఏదని అడిగితే వదిన విసుక్కుంది.

ఏటా పుట్టినరోజుకని ముందురోజు విజయని షాపుకి తీసుకెళ్ళి చీర కొనిచ్చే వాడు విశ్వం. కాని ఈసారి అలా చేయ లేదు. తనకు పట్టనట్లుగా ఊరుకున్నాడు.

రేపు పుట్టినరోజనగా పార్శిలు వచ్చింది విజయపేర. విజయ సంతకంపెట్టి పార్శిలు విప్పింది. కంజీవరం పట్టుచీర—పొలుసురుగు లాంటి తెలుపు. విజయ దాన్ని ఎవరికీ చూప కుండా లోపలికి తీసుకెళ్లింది.

తలంటు పోసుకొని ఆ చీరకట్టుకొని కాలేజీ కెళ్లింది. చీరని చూసి అంతా బాగుందన్నారు. 'దేవకన్యలా ఉన్నావు.' అంది సునంద. 'ఎక్కడకొన్నావే' అంది భామ. 'నిన్నీ చీరలో తలంటుకోగా ఎగిరే ముంగురులని చూస్తే నిన్ను నేనే పెళ్ళా డేయాలని పిస్తోంది.' అంది వరగ చూస్తూ.

ఆ రాత్రి పక్కమీద పడుకుందిగాని చాల రాత్రివరకు నిద్ర పట్టలేదు. ఏదో చెప్పలేని బాధ మనస్సులో ముసురుకుంటు న్నది. 'ప్రపంచంలో అంతా ఇంతేనా?' అనుకొంది. ఎదురుగోడకి పెళ్లినాటి ఫోటో—

విజయ లేచి కూర్చుంది. అటు ఇటు తిరిగింది. ఎక్కడ చూసినా నిశ్శబ్దం— హృదయంలో ఏదో చెప్పరాని వేదన—కలవరత పడుతూ ఏరాత్రికో నిద్రకి లోనయ్యింది.

ఆమె ఊరుకుండగా అన్నయ్య, వదిన ఇదివరకు అంత ఫ్రాంక్‌గా ప్రవర్తించలేదు. ఇంట్లో అందరూ తనపట్ల అంత నిరంకుశంగా ఎందుకు ప్రవర్తిస్తున్నారో విజయకి అర్థంగాలేదు.

బి. ఎ. పరీక్షలయ్యాయి. పేపర్లన్నీ బాగానే వ్రాసింది. కాలేజీ లేకపోవడంవల్ల ఇంట్లో ఉండాలంటే బోర్‌కొడుతున్నది విజయకి.

విశ్వం కమల సినిమాకి వెళ్ళిపోయారు. శాంతమ్మ లోకాభిరామాయణం కోసము ప్రక్కింటికి వెళ్ళింది. విజయగూడ తల్లికి చెప్పి బీచికి బయలుదేరింది.

తిరిగి ఇల్లు చేరేసరికి రాత్రి ఎనిమిది దాటింది.

బట్టలు మార్చుకుందుకని స్టాండు దగ్గరకెళ్ళగా టేబులుపై కవరు కన్పించింది. కవరు చించి ఉత్తరం పైకి తీసింది.

'ప్రియమైన వదినకి,

శారద నమస్కరించి వ్రాయునది. నేనెవరో మీకు అంతగా తెలియకపోయినా నన్ను నేను ముందుగా పరిచయం చేసుకోక తప్పదు. నేను వెల్‌ఫేర్ సెంటర్‌లో పని చేస్తున్నాను. నేను అన్నయ్య ఉన్న పాటాకి ప్రక్కపాటాలో ఉంటాను. నా స్వంత అన్నయ్య అయినా అంత అభిమానంతో చూడడేమో. అన్నయ్య తన బాధనంతా నాతో చెప్తాడు.

ఒక్కమాట వదినా! మిమ్మల్ని ప్రేమించినంతగా అన్నయ్య మరి ఎవర్ని ప్రేమించలేదంటాను. ప్రతిక్షణం మీరాక కోసం ఎదురుచూస్తున్నాడు. ప్రతిక్షణం దేన్నో పోగొట్టుకున్న నిర్భాగ్యునిలా బాధ పడ్తాడు. ఇంకో విషయం. ఈ విషయం వ్రాయాలని లేకున్నా, వ్రాయక తప్పలేదు. అన్నయ్య—వారం రోజులబట్టి ఇంటికి రాత్రిళ్ళు రావడంలేదుట. మొన్న స్కూటరుతోసహా తెలివిలేని స్థితిలో ఎవరో తీసుకు వచ్చి ఇంటిదగ్గర వదిలేరు. ఇప్పటికైనా అర్థమయ్యిందా వదినా. అన్నయ్య ఎలాంటి స్థితికి వచ్చేడో? రోజూ బార్‌కి వెళ్తున్నాడు. త్రాగని రోజంటూ లేదు. వద్దని ఎన్నోసార్లు బతిమాలేను. అయినా వినలేదు. 'నా కోసం బాధపడేవారు ఎవరున్నారు? ఈ సుఖంలో నా బాధంతా దూరమవుతోంది శారదా!—' అంటాడు. ఒక్కొక్కరోజు త్రాగిన మైకంలో పసివానిలా ఏడుస్తాడు. ఇప్పుడు చెప్పవదినా! అన్నయ్యస్థితిని చూస్తే నీకు జాలి కలగడంలేదా? భార్యగా నీవాతన్ని ప్రేమించి లాలించలేవా? స్త్రీగా నీ ధర్మాన్ని నిర్వర్తించలేవా వదినా! అన్నయ్య ఆరోగ్యం పాడయితే అది ఎవర్ని బాధిస్తుంది?... లోకం ఎవర్ని అంటుంది? నా మాటవిని ఒక్కసారి బాగా ఆలోచించు వదినా! మీ మనసు మార్చుకోమని ఈ మరదలు కోరుతున్నది. నా స్వంత అన్న కాకపోయినా, అతని హీనస్థితిని, ఆ బాధని చూడలేక, మీరు నా మాటలకి విలువ నిస్తారనే నమ్మకంతోనే ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. ఆలోచించు — చేయిదాటితే పండులాంటి బతుకులు దగ్ధమైపోతాయి. చేయి దాటి పోయింతర్వాత పశ్చాత్తాపం ప్రయోజనాన్నివ్వదు. నేను మీ మనస్సు నొప్పించినట్లయితే క్షమించండి—

ఇట్లు

శారద.'

ఉత్తరం చదివిన విజయ మనస్సులో భయంకరమైన కంపనం బయలుదేరింది. ఆలోచనలు—పిచ్చి ఆలోచనలు — భయంకరమైన ఆలోచనలు—వాటిమధ్య అరటాకులా కొట్టుకుంటున్నది ఆమె గుండె. గది అంతా చీకటి— ఆ చీకట్లో తానొక్కతే— ఎవరులేరు. 'ఎవరు ఏమి కారు' అంది హృదయం. నిలబడ్డానికి కాళ్లలో సత్తువ సన్నగిల్లుతున్నది. అలా కుర్చీలో వాలిపోయింది చైతన్యం లేనిదానిలా.

కళ్ళముందు విచారంగా ఉన్న రామం కన్పించేడు. ఆ బొమ్మ చెదిరిపోయింది. త్రాగి రోడ్డుమీదపడ్డ రామం కన్పించేడు— గడ్డంపెంచి, చిక్కి శల్యమైన రామం కన్పించేడు ఆ కళ్ళకి తీలగా. విజయ గట్టిగా కళ్ళు మూసుకుంది భయంతో. ఆమె కాళ్ళు గజగజ వణుకుతున్నాయి. అణువణువు 'నువ్వు...నువ్వు మనిషివి కాదు' అంటున్నట్లు ఫీలయ్యింది విజయ.

ఆమెలో ఏదో చైతన్యం—ఏదో చెప్పరాని వేదన—ఏదో మార్పు...

ఎన్నడు ఎదురూ చూడని విజయ రామం కోసం ఎదురుచూస్తున్నది. ఆమె ఎంతగా అతనికోసం తపిస్తున్నదో—ఆ నిరీక్షణ అంత

దూరంగా పోతోంది.

'పరోక్షంలో ఉన్న ఆనందం ప్రత్యక్షంలో లేదు' అన్నాడు వెనకటికో కవయిత. కైతత్వం రాకనే పాపాలిగాని, ప్రత్యక అవేకన లోని అంతరార్థం అనుభవించిన వాళికే తెలుస్తుంది. నిజమైన ప్రేమకీగం అర్థము చాల ఉత్తమమైనది. ఆ అర్థాన్ని గ్రహించి నడుచుకొని జీవితాన్ని స్వర్గతుల్యంగా మార్చుకొన్నవారే నిజమైన ప్రేమికులు నేటి సమాజంలో.

విజయకి ఇల్లు, ఇంట్లో మనుష్యులన్నా పీవగింపు కల్గుతున్నది. 'ఇందులో ఎవరు నాకు ఏమి కారు?' అన్న సత్యాన్ని తెలుసుకొంది. అయినా ఆడదానికి 'అహం' అనేది అప్పుడప్పుడు వ్యక్తిత్వంపై దెబ్బ తీస్తుంటుంది. విజయ ఆడదేగా? – అందుకే తనకు తానుగా భర్తను రమ్మని రాయలేక పోయింది.

విజయ నిరీక్షణలో ఆరునెలలు దాటి పోయింది.

ఒకరోజు విజయ స్నేహితురాలు రమణి మద్రాసు నుండి వచ్చింది.

విజయ ఇంటికి వచ్చింది. ఇద్దరు చాల సేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నారు.

మాటల మధ్యలో అంది రమణి. 'ఏం, నీవు యూనివర్శిటీలో చేరలేదేమి?' అని.

'చదవాలని లేదు.' తకీమని జవాబు చెప్పినందుకు రమణి ఆశ్చర్యపోయింది.

'కారణం...?' తిరిగి ప్రశ్నించింది రమణి.

'మనసుకి సరదా లేనప్పుడు కారణం ఏది చెప్పాలి?' అంది నెమ్మదిగా. ఆ మాటల లోని అర్థం రమణికి తెలియకపోలేదు. అయినా తెలుసుకోవాలనే కుతూహలం ఉంది కదూ!...

'హైద్రాబాదు వెళ్తున్నావా?'

'............'

'నాకు తెలుసు. నీ మాటల్లో ఆ విషయం తేలిందిలే. విజయా! నాకు చాల సంతోషంగా ఉందే. సమ్మర్‌లో మేము హైద్రాబాదు వస్తాము. అప్పుడు మీ ఇంట్లో నాలుగురోజులుంటాలే' అంది.

పొద్దుపోవడం వల్ల రమణి వెళ్ళి పోయింది.

ఆ విజయ మ్యాట్నీ సినిమా కెళ్ళి వచ్చేసింది. సినిమా

# పరివర్తన

చూస్తుండగానే తలనొప్పి వచ్చేసింది. ఆ సినిమా ఆమె శాశ్వత జీవితానికి దగ్గరై పోయింది.

ఇంటికి వచ్చి తన గదిలోకి వెళ్ళి పడుకుంది. కళ్ళుమూసుకున్నదే గాని ఎవరిదో కొత్త గొంతు, మాటలు లీలగా వినపడు తున్నాయి.

ఈ మధ్య కూతురి ప్రవర్తనను తల్లి పసిగట్టినట్లుంది. అందుకే కూతురి గది లోకి వచ్చి 'విజయా! రామం వచ్చేడే...' అంటూ కూతుర్ని తట్టి లేపింది.

లేచి ముందు గదిలోకి వచ్చి చూసింది.

విశ్వం రామం మాట్లాడుకుంటున్నారు. చూడడానికి మాత్రం నెలరోజుల్నుండి తిండి నిద్ర లేనట్లు అగుపించేడు విజయ కళ్ళకి. గడ్డం పెరిగింది. బట్టలు మాసేయి. కళ్ళు లోతుకు పోయాయి. అలానే చూస్తూ నిల్చుంది గుమ్మం లోపల.

'అయితే ఎంతవరకు తిరిగేవు బావా!?' అడిగేడు విశ్వం.

'తిరిగేను గాని పెద్ద సరదాతో కాదులే. దొరకని మనశ్శాంతి దృశ్యాల్ని చూడ్డంలో పొందగలనేమో అనుకున్నాను. కాని అదీ దొరకలేదు, చేతిలో గవ్వ మిగలక పోయినా.'

శాంతమ్మ కూతుర్ని పిలిచి 'కాఫీ పట్టు కెళ్తావా?...' అంది.

'హు హూ...నువ్వే ఇవ్వు.' అంది తల వంచుకుని.

మర్నాడు వీధి అరుగుమీద కూర్చుని సిగరెట్ కాలుస్తున్న రామంతో అంది సీతాలు.

'అమ్మగారు స్నానానికి రమ్మంటున్నారు' అని పిల్చింది.

తెలియక 'ఏ అమ్మగారు?...' అన్నాడు పరధ్యానంగా.

'ఇంకెవరు బాబూ!? తెల్దాఏటి?... విజయమ్మగారు' అనేసి ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోయింది

లేచి పెరట్లోకి వచ్చేడు రామం. చపటాపై జార్చితో వేడినీళ్ళు, సబ్బు, టవలు రెడీగా ఉన్నాయి. తలత్రిప్పి గుమ్మం లోకి చూసేడు. విజయ గుమ్మం ప్రక్కగా నిల్చుంది ఆరాధిలా.

ఆమెకళ్ళు 'పోసుకొండి' అని అర్థిస్తు న్నాయి. మౌనంగా స్నానంచేసి తువ్వాలు తుడ్చుకొని వస్తుండగా విజయవెళ్ళి స్నానం చేసిన పంచెను తడిపి ఆరవేసింది.

అప్పాట ఉండి రామం వెళ్ళిపోయాడు. వెళ్తున్నప్పుడు విజయ గదిముందుకు వచ్చి 'వెళ్తున్నాను' అనేసి కదిలిపోయాడు.

మూడునెలలు గడిచిపోయాయి. విజయకి పుట్టింట్లో రోజులు గడపటం చాల బాధగా తోచింది. అన్నయ్య, వదిన తన ఉనికినే మరచిపోయి వాళ్ళసరదాలు షికార్లు పాటలో లీనమయ్యారు—

* * *

హఠాత్తుగా వచ్చిన యువతిని చూసి శారద విస్తుపోయింది ముందు. కాస్త తమాయించుకొని 'రా వదినా!' అంటూ ఆప్యాయంగా పిల్చింది. వారిద్దరూ లోపలి కెళ్ళాక ఎన్నాళ్ళనుండో పరిచయ మున్నట్లు మాట్లాడుకొన్నారు. ఉత్తరం రాసి తనకోదారి చూపినందుకు శారదకి కృతజ్ఞత తెల్పుకుంది విజయ. శారద విజయ వచ్చినట్లు రామానికి ఆఫీసుకి ఫోనుచేసింది. మరో పది నిమిషాల కల్లా మోటరుసైకిల్‌మీద రామం వచ్చేడు.

వ్యాన్ని పిల్చి కాఫీ తెమ్మన్నాడు. శారద అంది.

'అబ్బో, వదిన వచ్చిందనగానే అప్పుడే కాఫీకి తరుముతున్నావే. ఆకాఫీపని నే పూర్తి చేశానులే. ముందు ఇంట్లో సరుకులు వగైరాలు చూడు. నేపట్నుంచీ సికా హోటలు తిండీ, నిన్ను స్వంతం తినమని పోరేయాలన్నా రెండూ ... తప్పేయి నాకు' అంది పరిహాసంగా నవ్వుతూ.

'అవునవును పిల్లని తాళం అలిసి పోయావ్!' అన్నాడు తిరిగి వెక్కిరింపుగా. ఆరోజు రామం ఆఫీసుకి వెళ్ళలేదు. ఇల్లంతా సర్దడంలో సామాన్లు తెప్పించడంలో లీన మయ్యాడు.

విజయవచ్చి వారం అయింది. కాని ఇరువురిమధ్య మౌనమె రాజ్యం చేస్తున్నది. ఆమె ఎంత కల్పించుకొని మాట్లాడబోయినా తప్పించుకొని తిరుగుతున్నాడు. విజయకి ఏలోటు రానివ్వకుండా అన్నీతెస్తున్నాడు. కాని ఏ ఆనందాన్నైతే కోరుకొని వచ్చాత్తా హృదయంతో వచ్చిందో ఆ సుఖం దూరంగా ఉండిపోయింది. జీవితానికి– కావ ఏసినన్ని లభించినా, ఏదో ఒకటి ఇంకా

ఆమె హృదయంలో జేనికోరిక్కైతే అరాట పడి, క్షణక్షణం తపిస్తూన్నదో ఆ తపన అలభ్యమవుతున్నది. అయినా అబలకదూ!... నోరు విడచి అడగాలని ఎన్నోసార్లు అను కుంది. ఏడ్చింది ఎన్నో రాత్రులు—

వెన్నెల—వెలవెల పోయింది. జాజులన్నీ వాడిపోతున్నాయి ఆమె వేడి నిట్టూర్పుల్లో పడి. అయినా రామం రాయిగా మారి పోయాడు. భర్తగా ఆమెపట్ల కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నాడు గాని, ఆమెలో రగిలే ... వేడి జ్వాలల్ని ఆర్పలేక పోతున్నాడు.

ఆ రాత్రి—విజయ రామం తెచ్చిన తెల్ల చీర కట్టుకుంది. ముడివేసుకొని ముడిపై జాజిపూల దండ ముడిచింది. దేవలోకం నుండి దిగి వచ్చిన దేవకన్యలా ఉంది ఆమె సౌందర్యం—కాని ఏమిలాభం? స్త్రీగదూ!— ఆమెలోని కోర్కెలు పగ్గాల్ని వదిలిన తేళ్లలా పరుగులెత్తసాగేయి. భర్త ఆలస్యం—ఆమెలో నిరాశా నిస్పృహల్ని రేపనెత్తేయి. కన్నీళ్ళు బుగ్గలపై చారలు కట్టేయి.

రాత్రి ఒంటిగంటకి తాగిన మైకంతో ఇంటికి వచ్చేడు. మెల్లిగా భర్తని చేతుల ఆసరాతో పక్కపై పడుకోబెట్టి బూట్లు సాక్సు విప్పింది. అలాగే నిద్రపోయాడు. మర్నాడు తన తప్పు తెలుసుకొని సిగ్గుపడి పోయాడు తనలో తానే. ఆమె ఏమనుకుందో అని బాధపడ్డాడు.

కాఫీ తెచ్చిన విజయ ముఖంలోకి చూసేడు. ఆమె రాత్రంతా ఏడ్చిందేమో, కళ్ళన్నీ వాచేయి.

'క్షమించు విజయా! నేనెంతో సిగ్గు పడుతున్నాను నిన్నటి నా ప్రవర్తనకి. ఇంకె ప్పుడూ ఇలా జరగనివ్వనని మాట ఇస్తు న్నాను' అన్నాడు. విజయ కళ్ల నుండి టప టపమని రెండు కన్నీటిబొట్లు టేబులుపై ఉన్న కాగితాలమీద పడ్డాయి.

ఖాళీ కప్పు తీసుకొని ఆమె వెళ్ళి పోయింది లోపలికి.

ఎన్నోసార్లు ప్రశ్నించుకున్నాడు రామం. 'నేనేమైనా తప్పు చేస్తున్నానా?' అని మరి ఎందుకీ హృదయం వణుస్తున్నది? గుండెల్లో ఏమిటో మంట— ఆ మంట ఎలా చల్లా ర్చాలి. ఏం చెయ్యాలి? అసలు నేనేం చేయాలిప్పుడు?' అలా రోజూ అనుకొని తన్ను తాను అసహ్యించుకుంటున్నాడు. కాని ఆ

**ఆమెను దూరం చేయడానికి మార్గమే** కనబడడం లేదు అతని మస్తిష్కానికి. అదే అతను చేయలేని పని. శారద రాగానే ఆమెతో అన్నాడు రామం. 'నీవు వదిన పేరడైజుకి వెళ్ళండి మంచి సినిమా వచ్చింది. టికట్లు తెచ్చేను' అన్నాడు. విజయ రానంది సారి.

ఎప్పుడూ శారదతోనే వెళ్ళడం తప్ప ఆయన రారు. ఆయనరాని ఆ సినిమాకి తనెందుకు వెళ్ళాలి?' అనుకొంది కాని సినిమాకి శారదే రాలేకపోయింది ఆఫీసులో పనివల్ల.

రామం తయారయ్యాడు. విజయలో నూతన ఉత్సాహం పొంగులుతిరి వెల్లువలా ప్రవహించింది. తెల్లచీర పట్టుఅంచుది, అదేపట్టంచు తెల్లజాకట్టు—పాతికేళ్ళుదాటని యవ్వనం— రామం కళ్ళు క్షణకాలం వశం తప్పేయి. అయినా నిగ్రహించుకున్నాడు.

సినిమా నించి తిరిగివచ్చి భోజనం చేసేరు కలిసే రామం పక్కమీద పడుకున్నాడు. విజ యకి నిద్రపట్టలేదు ఆమెలో ఏదో తెలియని బాధ—ఏదో వెలితి ఏదో తీరనివాంఛ—హృద యాన్ని ముంచివేసింది.

రాత్రి గోడ గడియారం ఒంటిగంట కొట్టింది. మంచినీళ్ళకని రామం లేచేడు. నీళ్లు వెతుక్కుంటూ పక్కవైపు చూసేడు. అతనిగుండె వేగంగా కొట్టుకోసాగింది అతర ఆలో వెరటన్నకి వెళ్ళిమాసేడు, వరండా మీదున్న గిట్టుపై మాకాళ్లమధ్య తల ఆన్చి కూర్చుంది విజయ.

— [illegible] గోడవైపు [illegible] ఏదో వెయ్యి చెంపల్ని తాకినట్లుయి ఆ స్పర్శలోని అనుభూతికి వెనక్కి తిరిగింది. రామం రెండుచేతులతో ఆమె చెంపల్ని నిమురుతూ 'ఇలా మంచులో కూర్చుంటే ఆరోగ్యం పాడవదూ?...' అన్నాడు లాలనగా. విజయ కళ్ళనుండి నీళ్ళు జల జల రాలసాగేయి రామం ఓదార్పు మాటలకి. 'లేహోయ్' ఏడు స్తున్నావా?... ఛీ ఛీ...' అంటూ కన్నీళ్ళు తుడిచి అమెను దగ్గరగా తీసుకొని హృద యానికి హత్తుకున్నాడు.

విజయ అతని ఒడిలో వాలిపోతూ అంది 'నన్ను క్షమించరూ! నన్నెప్పుడూ మీనుండి దూరం చేయకండి. ఆబాధ నేను భరించలేనిక' రామం తల నిమిరేడు 'నీవు నా హృదయరాణివి' అన్నాడు మెల్లిగా.

'మీ హృదయం చాల మంచిది అందుకే నన్నాదరించగలిగేరు. జీవితంలో సుఖదుఃఖాలు తోయి తొలకరి చినుకులు రాల్తాయా? అని ఎంతగానో విలపించేదాన్ని చాలా రాత్రులు. వెన్నెలరాత్రులు వెక్కిరిస్తున్నట్లుగా ఉండేవి. శారద రాత్రుల్లో నా మనస్సు ఆ తాపానికి తట్టుకోలేక విలవిలలాడిపోయేది.

'పశ్చాత్తాపంతో ఇద్దరి హృదయాలు కరిగి, కల్మషం కడిగివేయబడింది. మానవు నికి పశ్చాత్తాపంకన్న మించిన శిక్ష ఏదీ లేదు' అంటూ విజయని రెండుచేతులతో ఎత్తుకొని లోపలికి తీసుకొచ్చేడు రామం ●






# మల్లెల పరిమళాలు

యర్రం చంద్రశేఖరం

**ఇంతవరకు కథ**

లక్ష్మయ్యగారొక మోతుబరి రైతు. శాంత ఆయనకి ఏకైక కుమార్తె. తల్లిదండ్రులు లేని మేనల్లుడు రామాన్ని చిన్నప్పటినుండి తనే పెంచి పెద్ద చేస్తాడు. రామం చదువు హెచ్.ఎస్.సి.తో ఆపేసి వ్యవసాయపు పనులు చూసుకుంటాడు. అతను పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వుంటాడు. శాంతను కాలేజి చదువుకు పంపిస్తారు. కాలేజిలో ఆమెకి శారద అనే బీదవిద్యార్థిని స్నేహితురాలవుతుంది. శారద విషాదగాథ శాంతను కదిలించి వేస్తుంది. శారదకి ప్రభాకరం పరిచయమవుతాడు. ప్రభాకరానికి కాశీలో ప్రసాద్ స్నేహితుడవుతాడు. ప్రభాకరం దుడుకు స్వభావాన్ని కని పెట్టి ప్రసాద్ అతని ప్రవర్తనని మార్చాలని ప్రయత్నం చేస్తాడు. సుందరానికి తలవనితలంపుగా నీరజతో పరిచయమవుతుంది. నీరజ యింటికి వెళ్ళి ఆమె తండ్రికి వైద్యం చేసే భారం తన మీద వేసుకున్నాడు. నీరజ సుందరంపై ఎన్నో ఆశలు పెట్టుకున్నది. సుందరం తనవూరికి ప్రయాణమై వెళ్ళిపోయాడు. రామంమీద విసుగుచెందిన శాంత సుందరంమీద మోజుపడింది. ఇద్దరూ పెళ్ళిచేసుకోవాలనుకున్నారు.

## 14

'శాంతమ్మగోరు మన చిన్నయ్యగోర్ని పెళ్లాడరంట...!'

'ఇదేం యిడ్డూరం ... ? ఆరుపుట్టిన కాడనుండీ ఆ రిద్దరూ ఆలుమగలనే అనుకుంటుండారు గంద...!'

'మరి అమ్మాయిగోరు వోర్ని పెళ్లాడ్తా రంట?'

'ఆ డాకటేరుగ్గోరు లేరూ? రంగయ్య గోర సిన్నకొడుకు. ఆర్ని పెళ్లాడతారంట!'

'వోరు సెప్పినార్రా...నీకు?'

'ఎవరు సెప్పేదేందిరా? ఊరు ఊరంతా సెప్పుకుంటేనూ...!'

లక్ష్మయ్యగారి పాలేర్లు వారిదొడ్లో సమావేశమై మాట్లాడుకుంటున్నారు. దూరంగా పెద్దపాలేరు పుల్లయ్య రావడం గమనించినవారు గప్‌చుప్‌గా కూర్చున్నారు. అంతకుముందు ఏదో మాట్లాడుతూ ఉండి, తను రావడం గమనించి, అంతా బెల్లం కొట్టిన రాళ్లలాగా మాటలు ముడుచుకొని కూర్చోవడం అతనికి విస్మయాన్ని కలిగించింది.

'ఏందిరా...?ఏదో సమాయేశం ఏర్పాటు చేసిన్రు?' అన్నాడు పుల్లయ్య.

ఒకరిముఖాలు మరొకరు చూసుకో సాగారు—

'మాట్లాడరేంరా...?' గద్దించాడు.

'సెప్పండిరా ... !' అందులో ఒక డన్నాడు.

'మనకెందుకు లేద్దూ ... పెద్దోళ్లతో యివారం' నసిగాడు అసలు దీనికంతకూ మూలకారకుడైన పాలేరు.

'అసలు యిసయమేందో సెప్పి సావండెహె...!' విసుగుపడుతూ అన్నాడు పాలేరు పుల్లయ్య.

'మన శాంతమ్మగోరు రామంబాబుగోర్ని పెళ్లి సేసుకోరట గద!' మెల్లిగా గుస గుసలాడుతూ పుల్లయ్య చెవిలో చెప్పాడు ఒక పాలేరు.

'ఏడిసావ్! పెద్దోర్ని గురించిన యివరాలు మీ కెందుకురా! పోయి మీ మీ పనులు సూసుకోండి...!' గద్దించాడు బిగ్గరగా.

ఆ గద్దింపుకు ఎవరి పనులలో వారు నిమగ్నులయ్యారు—

ఈ విషయం అంతకుముందే విన్నాడు పాలేరుపుల్లయ్య. ఆ విషయంవిన్న దగ్గరనుండీ అతనికి ఏమీ పాలుపోవడం లేదు. ఈ సంగతి లక్ష్మయ్యగారితో చెప్పాలని ఆదుర్దాపడుతూ నడక వేగం హెచ్చిస్తూ యిల్లు చేరుకున్నాడు. ఇంటికి చేరేసరికి యింటివద్ద కూడా ఆదే విషయం చర్చించబడుతూ ఉంది. అతను విన్నదాన్ని, ఇక్కడ వీరు చర్చిస్తున్న విషయం బలపరిచింది. తల వంకిస్తూ, మెల్లగా యింటి వసారావైపు నడిచాడు.

అప్పుడే నిద్రలేచిన లక్ష్మయ్యగారు వరండాలో మంచంపై కూర్చుని పొగాకు కాడ ఈనె తీస్తూ చుట్టను చుడుతున్నారు. ముఖం గంభీరంగా ఉంది. వయసులో పండి, కష్టసుఖాల అనుభవాలతో మగ్గిన లక్ష్మయ్యగారంటే ఆ ఊరంతటికీ ఎంతో గౌరవము.

తను వచ్చినట్టు వారు గమనించాలని మెల్లిగా దగ్గాడు పుల్లయ్య.

కనురెప్పలను బరువుగా పైకెత్తుతూ, హుందాగా పుల్లయ్యను చూస్తూ 'ఏం పుల్లయ్యా...? ఏదో పనిపెట్టుకొనివచ్చినట్టున్నావ్!'

'అవును పెదబాబుగారూ! మీతో ఏకాంతంగా ఒక యిసయం మనవి సేసుకోవాలె!'

'నాతో మనవి చేసుకొనేదేముంది ? నీకేమైనా కావాలంటే రామాన్ని అడుగు.'

'అబ్బే! ఆ యిసయం కాదు దొరా ! వేరే ముఖ్య యిసయం' కంఠస్వరం తగ్గిస్తూ అన్నాడు.

'అంత ముఖ్య విషయం ఏమిటి పుల్లయ్యా? సరే! దగ్గరగావచ్చి చెప్పు' పుల్లయ్య ముఖంలోకి సూటిగా చూస్తూ అన్నారు లక్ష్మయ్యగారు.

పాలేర్లు మాట్లాడుకోవడం పుల్లయ్య

రావడం; వచ్చి పాలేర్లను గద్దిస్తూ - తన తండ్రి ఉన్న దగ్గరకు వెళ్లడం యివన్నీ గమనించింది శాంత. పార్వతమ్మగారు వంటింట్లో ఉన్నారు. రామం యింట్లో లేడు. మెల్లిగా లక్ష్మయ్యగారు కూర్చున్న వరండాకు వెనుకగా ఉన్న గదిలో చేరింది శాంత, విషయమేమిటో తెలుసుకోవాలనే కుతూహలంతో.

లక్ష్మయ్యగారు కూర్చున్న మంచం దగ్గరగా వెళ్లాడు పుల్లయ్య. అతని ముఖంలో కొట్టవచ్చినట్లు కనుపిస్తూన్న ఆందోళనకు ఆశ్చర్యపోతున్నారు లక్ష్మయ్యగారు.

'ఈ యిషయం మీదాకా వచ్చిందా బాబు గారూ?'

'ఏ విషయం పుల్లయ్యా?'

'నాకు చెప్పాలంటే గుబులేత్తుందండి. ఒకేళ అది నిజం కాకపోతే ఊరు ఊరంతా గుప్పుమంటుందా? నిప్పు లేనిదే పొగరాదు అంటూ జరగదు గదండీ...?'

'ఇంతకూ ఏం జరిగిందో చెప్పవేం?' గద్దించారు లక్ష్మయ్యగారు.

'ఏముంది దొరా! మన సిన్నమ్మగోరు సినబాబుగోర్ని పెళ్లాడరంట! పట్నంలో వదిలి రాలా...! ఆ డాకటేరుగోర్ని...'

'ఆపు...!' పుల్లయ్య మాటలు పూర్తిగా వినకుండానే అరిచారు లక్ష్మయ్యగారు.

వారి ముఖంలో ఎంతో మార్పు వచ్చింది. అగ్ని పర్వతంనుండి కుతకుతలాడే లావా పైకి ఉబికివచ్చేటట్లు వారి గుండెల నుండి కోపం ఉవ్వెత్తున ఉబికి రావడానికి సిద్ధంగా ఉంది. గంభీరంగా ఉన్నవారి ముఖం జేవురించింది. పూరిండ్లను అగ్ని దహించే విధంగా వారిని కోపం నిలువునా దహించివేస్తూ ఉంది. లక్ష్మయ్యగారిని ఆ స్థితిలో చూస్తున్న పాలేరు పుల్లయ్య గడగడ వణికిపోసాగాడు.

'పుల్లయ్యా ... ఎవరు చెప్పారు నీకీ సంగతి?' పిడుగుపడినప్పుడు వినిపించే మేఘ గర్జనలా ఉంది ఆయన స్వరం.

'బా...బు...గా...రూ...ఊళ్లో...అం...తా ..అను...కుంటుం...డారు' భయంతో ఎంతగానో వణికిపోతూ విశ్వప్రయత్నంచేసి పై మాటలు అనగలిగాడు పుల్లయ్య.

'సరే...! నీ వెళ్లు...!'

'బ్రతుకుజీవుడా' అని ఒక్క అంగలో



ఎక్కడినుండి వెళ్ళిపోయాడూ?

ఐదునిమిషాలు దీర్ఘంగా ఆలోచించారు లక్ష్మయ్యగారు.

'శాంతా' అని బిగ్గరగా అరుస్తూ యింటి లోపలికి వెళ్ళారు. పుల్లయ్య వెళ్ళిపోగానే శాంత మేడమీదగల తన గదిలోకి వెళ్ళింది. ఆ పిలుపులో కాఠిన్యానికి భయపడింది ఆమె. అలా భయపడితే తను తలచిన కార్యం నెరవేరడం కష్టమని ఊహిస్తూ లేని ధైర్యాన్ని నటిస్తూ క్రిందకు దిగింది.

'ఏమిటి నాన్నా పిలిచావ్...?'

'నేవిన్నది నిజమేనా?' నోటికి చిక్కిన ఆహారం తప్పిపోవడంతో బుసలుకొట్టే వృద్ధసింహంలా ఒగురుస్తూ అడిగారు లక్ష్మయ్యగారు.

'ఏం విన్నావు నాన్నా...? అసలు విషయం చెప్పకుండా అలా కోపగించుకుంటున్నావేం?' ఏమీ తెలియనట్లు అమాయకంగా ప్రశ్నించింది శాంత.

'ఎంత నంగనాచిలా మాట్లాడుతున్నావే! నేను ఏ కష్టతం(?) విని. నీ వివాహ విషయం నాకంటే ముందు ఊరివారందరికీ తెలిసింది. ఎంత అప్రతిష్ఠ! ఎంత అగౌరవం?' కోపంతో యింటి కప్పు అదిరిపోయేలా కేకలు వేయసాగారు.

ఆ కేకలకు లోపల వంట పని చేసుకుంటున్న పార్వతమ్మగారు గాభరాపడుతూ వీరున్నచోటికి వచ్చారు.

'ఏమిటండీ? అలా గావుకేకలు వేస్తున్నారెందుకు?' విషయం తెలియక చిక్కుముఖం పెట్టి ప్రశ్నించింది.

'ఇంకేముందే...? అంతా సర్వనాశనమైపోయింది. నేను మనసులో భయపడినంతా జరిగింది. నీ గారాబు కూతురు మన రామాన్ని పెళ్ళిచేసుకోదట! వాడు లేడూ...? సుందరం...పోకీలా వెధవ! వాణ్ణి చేసుకుంటుందట! ఈ విషయం మనకన్న ముందే ఊరివారందరికీ తెలిసింది. మన అంతస్తెక్కడ... ? వారి అంతస్తెక్కడ... ! అయినా బంగారంలాంటి రామాన్ని కాదని ఆ వెధవని చేసుకుంటానని పట్టుపట్టడం ఏమైనా న్యాయంగా ఉందా? నీవే చెప్పు.'

విరుచుకుపడ్డారు లక్ష్మయ్యగారు. ఉరవన(?). ఉరిమి, ఉరిమి మంగలం మీద విరుచుకుపడతారేం? ఏవి?

# మల్లెలా...

ఏం మాట్లాడాలో తోచక తల వంచుకొని నిలుచుంది శాంత. పార్వతమ్మగారు తనకేమీ పట్టనట్లు తనపని చూసుకోవడానికి వంటింట్లోకి వెళ్ళబోయారు. 'ఆగు' అని బిగ్గరగా అరిచారు లక్ష్మయ్యగారు.

ఆ అరుపుకు ఉలికిపడిన పార్వతమ్మగారి అడుగు ముందుకు పడలేదు—

లక్ష్మయ్యగారు శాంతను కోపంగా చూస్తూ 'ఈ విషయం ఎంతవరకు నిజమో చెప్పు' అన్నారు.

'నిజమే నాన్నా...!' నిర్భయంగా సమాధానం చెప్పింది శాంత.

నిప్పుపాత జ్వరరోగిలా ఆవేశంతో ఉలికిపడ్డారు లక్ష్మయ్యగారు, మందకొడిగా పడుతున్న గుర్రం వీపుపై కొరడాను ఝళిపించినట్లు శాంత మాటలు లక్ష్మయ్య గారికి పౌరుషం కలిగించాయి.



'వీల్లేదు. నా బొందిలో ప్రాణముండగా అలా జరగనివ్వను. పెళ్ళంటే బొమ్మలాట కాదు. వెయ్యేళ్ళ పంట'

'అందుకే నేను బావను చేసుకోనని సుందరాన్ని చేసుకుంటానని అంటున్నాను.'

'నోర్ముయ్! మంచి—చెడూ నిర్ణయం చేసే తాహతు, విచక్షణా జ్ఞానం నీ కెక్కడుంది ?'

'ఎందుకు లేదు నాన్నా? నేను యింకా పసిదాన్నా...?'

'లేదమ్మా! నీవు పసిదానవెందుకౌతావు? నీవు పసిదానవని అనుకుంటున్న మేము పసివాళ్ళం. పిట్టకొంచెం కూత ఘనంలాగా ఉంది నీ తీరు. చీపురుకట్టకు పట్టుకుచ్చు కట్టినట్లుంటుంది నిన్ను ఆ మంగలిగాడికిచ్చి వివాహం జరిపిస్తే' కోపంతో రెచ్చిపోతూ అన్నారు లక్ష్మయ్యగారు.

'మీరు ఎన్నైనా అనండి. నా మనసు మార్చుకొనేది లేదు.' ఖచ్చితంగా చెప్పింది శాంత.

'ఎలా మార్చుకోవో చూస్తాను'

శాంత మేడమీదకు, లక్ష్మయ్యగారు వసారాలోకి ఒకరిని మించిన వేగంతో మరొకరు వెళ్ళారు.

తనగదిలో కూర్చొని ఆలోచనలో పడింది శాంత. వరండాలో మంచంపై కూర్చొని శాంతపై కారాలు మిరియాలు నూరుతున్నారు లక్ష్మయ్యగారు. ఎవరికీ ఏమీ చెప్పలేని నిస్సహాయస్థితిలో వంటగదివైపు వెళ్ళారు పార్వతమ్మగారు.

* • •

పాలేరు పుల్లయ్య లక్ష్మయ్యగారి దగ్గరినుండి రామంకోసం పంచాయితీ ఆఫీసు వైపు బయలుదేరాడు. ఆఫీసు పనులు పూర్తి చేసిన రామం అప్పుడే లోపలినుండి బయటికి వస్తున్నాడు.

'ఏం పుల్లయ్యా ... ? ఎవరికోసం లోపలికి వెడుతున్నావ్!' రామం యివతలికి వస్తున్న విషయం గమనించకుండా ఆదరా బాదరాగా లోపలికి వెడుతూన్న పుల్లయ్యను ఆపుతూ అన్నాడు రామం.

'మీరా ... చినబాబుగారూ? మీ కోసమే వచ్చాను.'

'మామయ్య పిలుచుకు రమ్మన్నాడా?'

'తెలుసా?'

'మరి...!'

'మీతో ఒక ముఖ్యవిషయం మాట్లాడాలి...!' అటూ, యిటూ చూస్తూ అన్నాడు పుల్లయ్య.

'రహస్యమా?'

'అవును.'

'పద...! తోటకు వెడదాం!'

ఇద్దరూ తోటవైపు నడక ప్రారంభించారు. దారిలో రంగయ్యతాతపొలంలో పనిచేస్తున్న తాయారు రామాన్ని చూసి పిలిచింది.

'తొందర పనిమీద వెడుతున్నాను. మళ్ళీ కలుస్తాను' అని తాయారుతో చెప్పి పుల్లయ్యను అనుసరించాడు రామం.

ఆస్పత్రి భవనందాటి ముందుకు సాగిపోయారు యిద్దరూ. అక్కడికి దగ్గరలో కనుపిస్తున్న గులాబీ మొక్కలను చూస్తూ రామం 'మామా! ఆ గులాబీ మొక్కలు అలా వాడిపోతున్నాయి. సరిగా నీరు పెట్టడం లేదా?' ప్రశ్నించాడు.

'పెడతానే ఉండా బాబూ! అలా ఎందుకు వాడిపోతున్నాయో?'

'ఎన్నిరోజుల కొకసారి నీరు పెడుతున్నావ్?'

'వారానికి రెండుసార్లు'

'పోనీ రెండురోజుల కొకమారు పెట్టి చూడరాదూ?'

'అట్టాగే బాబూ!' అని ముఖమంతా చిన్నబుచ్చుకొని 'ఈ విషయం మీకు తెలిసిందా?' ప్రశ్నించాడు.

'ఏ విషయం?'

'అయితే తెల్వదన్నమాట!'

'అసలు ఏ విషయమో తెలుస్తేగా...? తెలుసు, తెలియదు అని చెప్పడానికి' ప్రశ్నార్థకంగా పుల్లయ్యను చూస్తూ అడిగాడు రామం.

'అదేమండీ...! చిన్నమ్మగారు మిమ్మల్ని పెళ్ళాడరంట!'

'ఏం...ఎవరు చెప్పారు?'

'అంతా అనుకుంటుండారు.'

'అంతా అనుకుంటున్నమాత్రాన నిజమౌతుందా?'

'అదేమిటి బాబూ? నిజం కాకపోతే వారు మాత్రం ఎందుకనుకుంటారు? కొంతలో కొంతైనా సత్యం లేకపోతాదా?'

'పోనీ నన్ను చేసుకోకపోతే మానె! ఎవర్ని చేసుకుంటుందో వారిని గురించి అనుకుంటున్నారా ఊళ్ళోవారంతా?' చిరునవ్వుతో అడిగారు రామం.

'మీకు నవ్వులాటగా ఉందా చినబాబూ? ఆరు డాక్టరుగారిని చేసుకుంటారని అంతా అనుకుంటూ ఉండారు.'

'నిజమేనా మామా...?' విస్మయంతో ప్రశ్నించాడు రామం.

'నా తల్లితోడు! ఈ విషయం పెదబాబుగారిసెయిన కూడా ఏసాను. మండిపడతండారు.'




'తెలుసా బాబూ! నీకేమీ తెలియదే?'

'నీకెట్టా తెలుస్తాది బాబూ...? నీ ముందు ఈ విషయం గురించి అనడానికి వారికైనా ఎన్నిగుండెలుంటాయి?'

'అవును. అందుకే మీ అందరికీ తెలిసినా నాకు తెలియలేదు' రామం ముఖంలో ఏ భావమూ కనుపించడంలేదు.

'అదేంది చినబాబూ? ఘుస్సు బుస్సుమంటారనుకున్నాను. అలా నిమ్మకు నీరెత్తినట్లు నిబ్బరంగా ఉన్నారేంటి?' ఆశ్చర్యపోతూ అడిగాడు.

'చూడు మామా...! శాంత చిన్నపిల్ల కాదు బెదిరించడానికి' అని ఒక్కక్షణం ఆగి మళ్ళీ 'నాకు తెలియక అడుగుతున్నాను. నాలో ఏదైనా మార్పువచ్చిందా?' రామం కళ్ళల్లో కొద్దిగా విషాదం తొణికిసలాడింది.

'అబ్బే...! మీలో ఏ మార్పూ రాలేదే!

'మొన్నటివరకూ నాతో కులాసా కబుర్లు చెప్పిన శాంత యింత త్వరగా ఎందుకు మనసు మార్చుకుంది? నాకేం తోచడం లేదు.'

'ఇప్పుడు మరెట్టా...?' ఆదుర్దాతో అన్నాడు.

'పిచ్చివాడా! ఈ విషయంలో నిజమెంతో అబద్ధమెంతో మనకు తెలియదు. ఇంకా నేను శాంతతో మాట్లాడలేదు కూడా! ఈ మాత్రానికే త్వరపడి ఆందోళన పడనక్కరలేదు. అయినా విధి నిర్ణయం ఎలా ఉంటే అలా జరుగుతుంది. ఇటువంటి విషయాలు భగవంతుని నిర్ణయాలపై జరుగుతూ ఉంటాయి. ఆవేశపడి, ఆదుర్దాపడి, చివరకు బాధపడి కూడా మనం చేయగలిగేదేమీ ఉండదు.'

'అవతల కొంపలంటుకుపోతూంటే మీరు వేదాంతంలో పడ్డారేమిటి చినబాబూ...!'

'వేదాంతంకాదు పుల్లయ్యా. నిజానికి జరిగేదంతే! పీటలమీద పెళ్ళిళ్ళు ఎన్ని ఆగిపోవడంలేదు. సక్రమంగా వివాహం జరిగిన తర్వాత ఎంతమంది విడిపోవడంలేదు?' అంత ధైర్యంగా మాట్లాడుతున్నా అతని కళ్ళల్లో దైన్యం తొంగి చూస్తూనే ఉంది.

'అవేం మాటలు చినబాబూ? శాంతమ్మగారు మీసొత్తు. ఆరిమీద వేరికి హక్కు లేదు. ఏదో చిన్నతనం. ఆంత మాత్రానికే మీరు బిగుసుకుపోతే ఎలాగుండి?'

'లేదు పుల్లయ్యా! ఇది బిగుసుకు

తోసడం కాదు. యథార్థ విషయం. బిరా నేర్పి పెరి కుండా ఎలా ఉంటాను.'

'ఏం చేది చినబాబూ...! ఎన్నాళ్ళా సినాపని మీసిలిపోవాలి' పుల్లయ్య లేచి వెళ్ళి పోయాడు.

'ఇంత త్వరగా యింటికి వెళ్ళాలా... వద్దా' అని ఆలోచిస్తున్నాడు రామం. 'ఇప్పుడే వెడితే ఈ విషయంలో మామయ్య రాద్ధాంతం చేస్తాడు. గొడవ జరుగుతుంది. తప్పంతా నామీదే పెడతాడు. శాంత తన మనస్సు మార్చుకుంటుందని కలలోకూడ తలవలేదు. నేనేమైనా ఫర్వాలేదు. మామయ్యను ఆగపట్టడం చాలా కష్టం. ఆవేశం పెంచుకొని కేకలు వేస్తాడు, గొడవ చేస్తాడు. ఇంటి సంతటినీ ఒక్కకొలిక్కి తీసుకు వస్తాడు. ఏం చేయాలో తోచడంలేదు. సరే...! ఈ పరిస్థితిని ఈరోజు కాకపోతే రేపైనా ఎదుర్కోవాలి. ఎంతకాలమని తప్పించుకు తిరుగగలను? తప్పదు...! వెడతాను. ఎలా జరగవలసిఉంటే అలా జరుగుతుంది' అని ఆలోచిస్తూ లేచి యింటి వైపు నడవసాగాడు.

* * *

తలవంచుకొని యింటిలోపలికి వెడుతూన్న రామాన్ని వరండాలో మంచంమీద కూర్చున్న లక్ష్మయ్యగారు ఆపారు.

లక్ష్మయ్యగారి కళ్ళు కోపంతో బాధతో రెచ్చిన గాయంలా ఎర్రగా ఉన్నాయి. లోకంలోని విషాదమంతా ఆయనగారి ముఖం లోనే గూడు కట్టుకొని ఉందేమోనని ఆ నిముషంలో వారినిచూసిన రామానికి అనిపించింది.

'రామం...నేను భయపడినట్లే జరిగింది.' వారిమాటలలో బాధ, కోపం ధ్వనించాయి.

'ఏం జరిగింది మామయ్యా?' ఏమీ ఎరగనట్లు ప్రశ్నించాడు రామం.

'ఏం జరగకూడదో అదే జరిగింది. శాంత సర్వ స్వతంత్రురాలైంది. ఏదో ఒక నాడు ఈ పరిస్థితి వస్తుందనే దాన్ని చదివించవద్దని నేను నెత్తీ, నోరు కొట్టుకున్నాను. నామాట పెడచెవిన పెట్టావు. ఇక యిప్పుడు ఏం చేస్తావో? నీవే ఆలోచించుకో... శాంత సుందరాన్ని వివాహం చేసుకుంటుందట!'

'ఈమాట శాంతే అందా మామయ్యా?'

'అవును. శాంతే అంది' ఆమాట వత్తి

# వారఫలం

**16-4-1971 శుక్రవారం మొదలు**

**22-4-1971 గురువారం వరకు**

**మేషం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృషభం:** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిథునం:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారంమధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. సాటివారితో గౌరవం బాగా ఉంటుంది.

**కర్కాటకం:** వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీరు శ్రమపడినా, ప్రయోజనం ఉండదు.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**సింహం:** మీకు ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. నూతనవిషయాలను తెల్సుకొంటారు. వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకారం కోసం వ్యయం చేస్తారు.

**కన్య:** అన్ని వ్యవహారాల్లోనూ ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు లభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన సందేహాలు కలుగుతాయి.

స్త్రీలకు:— బంధుమిత్రులను కల్సుకొంటారు. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**తుల:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. కోర్టు వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో అన్నివ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. సన్మానాంగళ్ళూ లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మకరం:** వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. మీకు ముమ్ముందు ఉపయోగించగల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరుతాయి.

**కుంభం:** రావలసిన డబ్బు సమయానికి అందగలదు. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. వారం మధ్యలో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటాయి.

—మహేష్ ●



# అత్తగారూ— సోడా



## భానుమతీ రామకృష్ణ

మధ్యాన్నం మావాడు వాడి 'ఫ్రెండ్స్‌ని' చాలామందిని భోజనానికి పిలిచి విందుచేశాడు. ఆ విందు భోజనం యింట్లో అందరితో బాటు నేనూ ఆరగించాను. నలభై దాటిం తర్వాత తినాలనే ఆశేగాని అరిగించుకుండే శక్తి ఎక్కణ్ణించి వస్తుంది! కడుపులో సంకటం ప్రారంభమైంది ... బాధపడుతూ కూర్చున్నా...

'యిలాంటప్పుడు ఓ సోడా తాగితే టక్కున సరిపోతుందండీ!' అన్నాడు మా మేనేజరు.

ఆయన స్వానుభవంతో కూడిన సలహా అది. మా మేనేజరు తింటానికే పుట్టిన మహాకాయుడు...తిండి ఎక్కువయి కడుపులో బాగా లేకపోతే అరగించే ఉపాయం కనిపెట్టాలేగాని, తిండి మానకూడదనే 'థీయరీ' ఆయనది. తన కడుపులో ఏ మాత్రం సంకటంగావున్నా, తక్షణం రెండు సోడాలు తెప్పించేవాడు మా మేనేజరు... ఆయనకు డబుల్‌డోసు కావాల్లెండి భోజనం (ఝాగి మందుదాకా) రెండు పెద్ద నాలుగు నిమ్మ పండ్లు పిండి పంచాలు ఉప్పవేసి, సోడాలు రెండూ ఆ గ్లాసులో పోసేవాడు...తక్షణం ట్సేలాగా బుస్సుమనిపొంగే ఆ రెండు గ్లాసులూ ఎత్తి గటగటగట తాగేసేవాడు... ఆ దెబ్బతో యాభై త్రేపులు రావడం అరగంట తిరక్కుండానే ఆయన కడుపులో ఆకలి మిషను చకచకచక స్పీడుగా పనిచెయ్యడం గెవరెవ ఆకలి పుట్టుకురావడం అపురావురు మంటూ ఆయన వెళ్ళి అమాంతం అన్నం మీద విరుచుకుపట్టం జరుగుతూవుంటాయి. అది ఆయన అజీర్ణ నిర్మూలనసాధన... ఆయన తయారుచేసే ఆ సోడాల ప్రిపరేషన్ పేరు అహ, మహ, రావణాస్త్రం అని పేరు పెట్టాం...

ఒకసారి మా అత్తగారికి కడుపులో కాస్త సంకటంగా వుందంటే ఆ రావణాస్త్రం యిచ్చాడు మా మేనేజరు ... పాపం మూడురోజులదాకా విరోచనాలు పట్టుకుని కడుపు దొక్కుపోయి చచ్చి బ్రతికింది ... ఆ దెబ్బతో మా అత్తగారికి ఆ అస్త్రం పేరు చెప్తే ఒళ్ళుమంట...అందుకే అప్పట్నుంచి భయపడి మేనేజరు మా కెవరికీ ఆ అస్త్రం తాగమని చెప్పడు ... ఒట్టి సోడా తాగండి అన్నాడు.

ఓ సోడా తీసుకురమ్మని పని పిల్లవాడిని పంపాను—కొంచం సేపయ్యాక వాడు ఒట్టి చేతుల్తో తిరిగొచ్చాడు—

'సోడా ఏదిరా!'

'లేదమ్మా... ఈ రోడ్డులోవున్న అంగళ్ళన్నీ వెతికాను...సోడాల్లేవు...'

'ఏమైనాయిరా! ఈ రోడ్డంతా సోడా కొట్లేగా!...'

'అవునమ్మా మొన్నటిదాకా వుండేయి... ఎలక్షన్లు గదమ్మా! రెండుపార్టీలవాళ్ళ మీటింగుల్లో ఎక్కడబడితే అక్కడ సోడా బుడ్లు ఒకరిమీదొకరు యిసిరికొట్టుకున్నారు ... దాంతో వూళ్ళోవుండే సోడా బుడ్లన్నీ ఎగిరిపొయ్యాయంట' అని పని పిల్లవాడు చెప్తూంటే యిలాంటి పరిస్థితుల్లో దేశం ఏమై పోతుందోనని గాభరాతో కడుపులో నొప్పి మరి కాస్త ఎక్కువైంది.

'ఏమిటమ్మా కడుపు నొక్కుకుంటున్నారూ!...కడుపులో బాగోలేదా!' అంటూ మా వాడికి చిన్నప్పుడు ట్యూషన్ చెప్పిన మాస్టరుగారి భార్య శాంతమ్మ వచ్చింది.

'లేదండీ! మధ్యాన్నం కొంచం విందు భోజనం తగిలింది...అరుగుదు పడలేదు...'

'అయితే వెంటనే ఓ సోడా తాగేసెయ్యండి!...చప్పున తగ్గుతుంది!...'

'ఎక్కడండీ! ఏ కొట్లోనూ సోడా దొరకలేదు...'

'ఏం! ఎందుకని!—

'ఎలక్షన్లు గదండీ! — రెండు పార్టీల వాళ్ళకూ సోడాలే ఆయుధాలైనాయిట...'

'ఓహో! అదా! అవునండీ! ఈరోజు ప్రొద్దుట మాయింటిదగ్గర రెండు పార్టీల వాళ్ళూ సోడాబుడ్లు విసిరికొట్టుకుని చాలా మందికి గాయాలు తగిలాయిట. ఒకరిద్దరి పరిస్థితి ప్రమాదంగా వుందట హాస్పిటల్లో చెప్పుకుంటున్నారు—'

'మరింకేం! యిన్నిచోట్ల సోడాబుడ్లు పగిలిపోతుంటే తాగడానికెట్లా దొరుకుతాయి''.. అని నేనంటూండగా మా బావగారొచ్చారు...

'ఏమిటమ్మా అలా కూర్చున్నావు! కడుపునొప్పా!—' అని అడిగారు:

'అవునండీ...మధ్యాహ్నం తిన్నతిండి అరగలేదు...'

'అయితే వెంటనే ఓ సోడా తాగేస్తే తగ్గిపోతుందే!

నాకు నవ్వొచ్చింది—

'అదే మాట్లాడుతున్నాం ... ఎక్కడా సోడాలు దొరకలా—ఈ రోడ్డంతా వెదికినా... ఎలక్షన్లుగదూ రెండు పార్టీలవాళ్ళూ—'

'ఆ!...అవునవును...అన్నట్లు ప్రొద్దుట నేను వస్తుంటే రెండు పార్టీల వాళ్ళకు మాటా మాటా వచ్చి బస్సులు ఆపి, భయంకరంగా పోట్లాడుకోడమేగాక ప్రక్కనున్న అంగళ్లలోంచి సోడాబుడ్లు తెచ్చి కొట్టుకోడం నాకళ్లారా చూశాను...నాకు గాభరా పుట్టుకొచ్చి నామీద ఆ సెంకులు ఎక్కడ పడతాయోనని వెంటనే పరుగెత్తి ఎలక్ట్రిక్ ట్రెయిను పట్టుకొని ఆటో రిక్షాలో అరగంట లేటుగా ఆఫీసుకొచ్చా... ఏమిటో దేశం యీ స్థితిలో వుంది... ఎట్లా వుంటుందో ముందు ముందు ఆ భగవంతుడికే తెలుసు...పోనీ కాస్త వాముతినమ్మా నాటువైద్యమైనా పనిచేస్తుంది వెంటనే...' అని చెప్పి వెళ్లారు మా బావగారు...ఆయనటు వెళ్ళగానే మా అన్నకూతురూ దాని భర్తా పిల్లలూ వచ్చారు.

'ఏమే ఓటువేశారా!' అని అడిగాను వాళ్లను చూస్తూనే—

'అయ్యో మాకు ఓట్లు లేవు పొమ్మన్నారు... మేము డి. ఎం. కె. కి వేస్తామని మొదటి పార్టీ వాళ్ళు పసిగట్టారట మా పేర్లు కొట్టేశారు...'



# అత్తగారి ఓటు



'అరెరె! అదెట్లా జరుగుతుంది!... మీరడగలా.'

'యింక అడిగేదేముంది!... మా పంచాయితీబోర్డు ప్రెసిడెంట్ కాంగ్రెసుపార్టీ... మేముండే చోటంతా డి. ఎం. కె. వోట్లు ఎక్కువపడలాయి తెలిసేచేశారు.. యిక వాళ్లతో ఎవరు పేచీపెట్టుకుంటారని పల క్కుండా వూరుకున్నాం...' అంటూ వాళ్ల పిల్లల్ని తీసుకుని పక్కనున్న స్టుడియోలో షూటింగ్ చూసివస్తామని వెళ్లారు.

'అయ్యో యీ విధంగా చాలాచోట్ల జరిగిందన్నమాట పిల్ల కెక్కువ వోట్లొస్తాయని వాళ్లా వాళ్ల కెక్కువ వస్తాయేమోనని పిళ్లా అనవసరంగా అనుమానించి మా పేటలో చాలామందికి వోట్లు లేకుండా చేశారు. అన్నట్లు మీ అత్తగారు వోటు వేశారా!...'

'ఆ వేశారు...కాని ఎవరికి వేశారో చెప్పనంటున్నారు...'

'ఏమిటీ! మీగ్గూడా చెప్పలేదా!..

'లేదండీ!...' అన్నాను.

'ఏరీ ఆమె కనిపించరేం!'

'యిప్పుడే వో కునుకు తీసి లేచి పెరటి దొడ్డి కెళ్లారు. మా ఆవు దూడను వేసిందిగా మొన్న దాన్ని పలకరించి ముద్దులాడిగాని రారు...'

'వోహో! ఏ ఆవు వేసిందండీ!

...! కామాక్షా!'

'మా అత్తగారు ఆవులకు పెట్టిన పేర్లు లెండి)

'కామాక్షి...'

'ఇది రెండో ఈతనుకుంటాను!'

'అవునండీ! ... దాని మొదటి ఈత సంతానం పేరు గణపతి... ఈసారి పెయ్య దూడను వేసింది... మా అత్తగారు ఇప్పుడు పుట్టిందానికి రెండుమూడు పేర్లు సెలెక్ట్ చేసి వుంచారు. ఒకటి చాముండేశ్వరి, రెండు అఖిలాండేశ్వరి, మూడు భువనేశ్వరి... ఏదైనా పెట్టొచ్చు మంచిరోజు చూసి...'

'మీనాక్షి ఎన్నీతల్లైంది!'—

'రెండు — రెండూ పెయ్యదూడలే... మొదటిదాని పేరు బాలా త్రిపురసుందరి... రెండోదాని పేరు ఆదిలక్ష్మి...

శాంతమ్మగారు పరగబడి వచ్చారు.

'ఎంత పుణ్యాత్ములమ్మా మీరు!... వాటన్నిటినీ పిలిచేటప్పుడు ఎంతో దైవ స్మరణ జరుగుతుంటుంది...యిక వేరేపూజలే అక్కర్లేదు! అన్నట్లు గేదె వున్నట్లుందే దానిపేరేమిటో!...

'దుర్గ! దాని పెయ్యదూడపేరు స్వర్ణ గౌరి...అది స్వర్ణగౌరీ వ్రతంరోజు పుట్టింది అందుకని ఆపేరు పెట్టారామె—

'అబ్బో! ఆమెకు గొడ్లపేర్ల విషయంలో కూడా ఎన్నిపట్టింపులు! ఎంత శద్ధ! మన మంచి పేర్లకూడా యింత బాధపడం— యింతకీ ఆమెవోటు ఎవరికి వేసిందంటారూ!—'

'ఏమోనండీ! ఆవిషయం మాత్రం చెప్పనంటున్నారామె!...ఎంతో ఆడిగారు వాళ్లబ్బాయీ, మనవడూకూడా, చెప్పలా... మీ కెందుకురా! ఎవరికొకరికి వేశాన్లే... నేనెందుకు చెప్పాలి! మీవోటు రహస్యంగా వుంచండి అని మన పంచాయితీబోర్డు ప్రెసిడెంటు మరీ మరీ చెప్పిపోయాడు... తప్పుగదూ చెప్తే!...' అన్నారు...

'అబ్బో అబ్బో! పెద్దావిడె బలే ఏడిపిస్తోందే అందర్నీ!... అయితే ఆవిడ కిష్టమైంది ఆవూ దూడేగా దానికేసిందేమో వోటు మరి...

'అబ్బే'... నేనూ మొదట అలాగే అను కున్నాను. కాని ఆమెకి రాట్నం అంటే చాలా చాలా యిష్టం...మా యింట్లో ఆమె చిన్న ప్పుడు ఒడికినరాట్నం అటకమీదుంది. దానికి ప్రతి శుక్రవారం నాచేత పసుపు కుంకుమలు పెట్టించి ఎంతో భక్తితో నమస్కరిస్తారు. అదే దేశానికి రక్ష అంటూంటారామె ...ఆ రోజు వోటు కాగితంమీద రాట్నం బొమ్మచూసి ఆమెముఖం చాటంతయింది.

'బాగా! ... అయితే రాట్నాని కేసిందేమో'...

'బ్బే!...మళ్లీ అక్కడా దెబ్బతిన్నాం... ప్రతి రోజూ సూర్యనమస్కారం చేస్తూ

# ప్రతివారికీ రక్షణ కావాలి




ఈ రక్షణ బాక్టీరియానుండి, చెమట వాసననుండి—మీరు, ఇతరులు సంకోచపడే అవస్థనుండి—

జి-11 (హెక్సాక్లోరోఫిన్)తో కూడిన

**సింథాల్ టాయిలెట్ పౌడర్**
మీకి రక్షణలన్నీ ఇస్తుంది

ఇవేకాదు—సువాసన సుమసుగంధం—

**సింథాల్—**
దుర్గంధములనుండి
సంపూర్ణ రక్షణనిచ్చు
టాయిలెట్ పౌడరు

Interpub/GP/3 Tel

చిత్ర హృదయం చదువుతారుగా ఆమె!... సూర్యనారాయణ మూర్తి ప్రత్యక్ష దైవం అంటుంది ... వోటు కాగితం మీ దున్న డి. ఎస్. కె. సూర్య ది బొమ్మ చూసి దానికి నమస్కారం చేసింది...'

'ఓహో! అయితే డి. ఎస్. కె. కి వేసుం టారావిడ—'

'అబ్బే అట్లా అనుకోడానికీ లేదే!— వోటు కాగితం మీదే అవుడూడను చూసి నప్పుడు ఎంత మురిసిపోయారూ ఆమె! మన మీనాక్షి, లక్ష్మిలాగా వున్నయి కదే ఈ ఆవూ దూడా బొమ్మ!—అని నాతో అంటూ ఆ బొమ్మను అప్యాయంగా చేత్తో తడివారు.'

'అట్లాగా!... అయితే పెద్ద నమస్కా అయిందే!...ఆవిడ వోటు కాగితంమీద ముద్ర వేయడం మీరు చూశారా! —'

'లేదండీ ఒకళ్ళ తర్వాత ఒకళ్ళా వెళ్ళి వేశాం — ఆవిడకి వోటు కాగితాలు యిచ్చి మీయిష్టం అయిందానిమీద వేసి మడిచి పెట్టి ఈ పెట్టెలో వేయండి అని చెప్పారు— ఆమె లోపలకువెళ్ళి కొంచం సేపయ్యాక బయటి కొచ్చారు—వోటు కాగితం మడత పెడుతూ రి బల్లదగ్గరున్నవాళ్ళు ముందున్న పెట్టెలో వేస్తున్నారు. ఆ పెట్టె చెయ్యితాకకుండా మడిగా ఎత్తి పడేశారు ... వాళ్ళు వుల తో 'తాలు పెట్టెలోకి తోశారు ... తర్వాత నేనొచ్చాను ...'

# అత్తగారూ ఓటూ

'అదుగో! వస్తున్నారు ... వే నడుగుతా మండండి' అన్నది శాంతమ్మ.

'అడిగి చూడండి...మీకైనా చెప్తారేమో చూద్దాం...' అన్నాను.

మా అత్తగారు శాంతమ్మను చూసి 'హోహో శాంతమ్మా! ఎంతసేపైంది ఒచ్చి! చాలా రోజులైందే కనిపించి!... మీ వారూ పిల్లలూ బాగున్నారా! ...'అంటూ నావైపు తిరిగి 'ఏమే! సోడా తాగావా! కడుపునొప్పి ఎట్లావుందిప్పుడూ' అన్నారు.

'అలాగేవుంది ... యింకా సోడా తాగలా'

'ఏం! ఎందుకు తాగలేదూ!'



ఇంతలోకే శాంతమ్మ అందుకున్నది —

'సోడాలు దొరక లేదటండీ! ...ఈ ఎలి క్షన్ల గొడవల్లో రెండుపార్టీలవాళ్ళూ కొట్టుకోటాల్లో సోడాబుడ్లు వేలకివేలు పగిలిపోయాయిట...'

అందుకని ఈ రోజుల్లో ఒక్క అంగ ట్లోనూ సోడా ల్లేవుట...!

'హారి వీళ్ళ అఘాయిత్యాలు మండి పోనూ!... ఎవళ్ళకే బొమ్మలిష్టమో ఆ బొమ్మలకు వోట్లు వేసుకుంటారు — దానికి కొట్టుకోడాలూ పొడుచుకోడాలూ ఎందుకూ!...

ఇంక ఈనాటికి వోట్లూ పాడూ ఏందుకూ! పూర్వం రాజుల్లాగా ఎవడు బలవంతుడైతే వాడే మిగతావాళ్ళని చావ కొట్టి రాజ్యం నాది అని ఆక్రమించి ఏలుకోవచ్చుగా! ... ఆనాడు బ్రహ్మంగారు చెప్పిందంతా అక్షరాలా జరుగుతూంది దమ్మా...'

'బాగా చెప్పారు ... అన్నట్లు మీ రెవరి కేశారు వోటు?'అని అడిగింది శాంతమ్మ... మా అత్తగారు 'ముసిముసినవ్వు నవ్వుతూ నేనెవళ్ళకేస్తే ఏమిటే ముసలిదాన్ని నా వోటు ఎవరిక్కావాలి! నువ్వూ మీ ఆయనా ఎవరికేశారు అది చెప్పు.'

'అదేమిటండోయ్! ముసలివాళ్ల వోటుకే చాలా విలువ యిప్పుడు ... ఎవరో నూట యిరవైయేళ్ల ఆవిడ వోటు వేసిందిట... ఈసారి మా అమ్మ మ్మ ముసలివాళ్లంతా ఎన్నడూ వోటువేయనివాళ్ళంతా వచ్చి వేస్తున్నారు... మీరు వెయ్యడం అందరికీ ఎంతో ఉత్సాహాన్ని కలిగించి వుంటుంది...'

'ఆ ఏం ఉత్సాహమో లెండి...ఈ వారం రోజులుగా ఈ ప్రాంతాన ఎన్ని కొట్లాటలు జరిగాయో ఒక్కొక్కటి మా పనిమనిషి చెప్తూంటే నా ఘటం వుండగానే యింత అరాజకం ఏర్పడుతుందని అనుకోలా ... బ్రహ్మంగారు కాలజ్ఞానంలో వ్రాసినవన్నీ జరుగుతూనే వున్నాయి ... యింకా ఏం జరుగుతాయో! ప్రపంచం అంతటా అల్లకల్లోలంగా వుంది ఏది విన్నాగూడా...' అంటూ తను వోటు ఎవరికి వేసింది చెప్పకుండా సంభాషణ వేరే గొడవల్లోకి తిప్పారు మా అత్తగారు...శాంతమ్మ పెద్దావిడ తెలివితేటలకి ఆశ్చర్యపడిపోతూ నావైపు తిరిగి 'చూశారా!' అన్నట్లు చూసింది...

'అన్నట్లు వోట్ల ఫలితాలు ఈరోజే తెలుస్తాయిటనా! వూరంతా అల్లకల్లోలంగా వుంటుందట్సు సాయంకాలం ఎవరూ బయటికి వెళ్ళగూడ దంటున్నారు—'

'అవునట వంటవాడు చెప్తున్నాడు... కలకత్తాలో జరిగినట్లు గొడవలు జరు గుతా యంటున్నాడు ... ఈ రోజు ఎవరూ బయటికి పోకూడదట...అంటూ' నా వైపు తిరిగి 'ఏమే అబ్బాయితో చెప్పావా! ఈ రోజు సినిమాకీ గినిమాకీ పోవద్దని!...'

'కాని వాళ్ళు వినరు—రోజంతా యింట్లో కూర్చుంటే 'బోర్' కొడుతుందని బయ ల్దేరొచ్చు సాయంకాలం...చెప్పలేం!...'

'ఏమిటే! బోడా! మాట మాట్లాడితే ఈ కాలం పిల్లల కిదో మాటొచ్చింది... షంమ నే చెప్తాలే వాడికి...ఎక్కడికీ బయ ల్దేరకుండా నేనే లంకి ణి లా వాకిట్లో కూర్చుంటూ అంతే—' అని మా అత్తగా రంటూంటే,

'మీ చాదస్తంకానీ ఈ కాల ప్పిల్లల్ని పట్టుకోడం కష్టం అండీ... అని శాంతమ్మ అంటూంటే, అప్పుడే పాలుపిండి పనివాడు మీనాక్షినీ దానిదూడ లక్ష్మి నీ తీసుకొచ్చి మా ముందున్న లాన్‌లో గడ్డి మేయడానికి కట్టేసి వెళ్ళాడు—వాటినిచూసి శాంతమ్మ మా అత్తగారి వోటువిషయం చివరిసారిగా ...యటికి లాగడానికి ప్రయత్నించారు...

'నాకు మీ ఆవూ దూడనూ చూస్తుంటె వోటు కాగితంమీద ఆవూ దూడా గుర్తు కొస్తోంది ... చక్కగా పశులక్ష్మి...మీకు నచ్చలేదండీ ఆవూ దూడా బొమ్మ' ... అన్నది మా అత్తగార్నిచూసి...

'హాఁ భేషుగ్గావుంది బొమ్మ ... అయితే మీ రంతా ఆవూ దూడకూ వేశారన్నమాట వోట్లు!...' అన్నారు మా అత్తగారు. శాంతమ్మవెల వెల బోతూ —

'మీకెట్లా తెలిసింది! మేమంతా ఆవూ దూడకు వేశామనీ'... అన్నది—

'అసలు ఆవూ దూడనుచూసి వోటు వెయ్యనివాడు మనిషా! పశువా! చెప్పండి!..'

'అయితే మీరూ ఆవూ దూడకే వేశా రన్న మాట!'—అన్నారు శాంతమ్మ:

'ఒక్క ఆవూ దూడకే వేస్తే మిగతా వాళ్ళేం కావాలా!'

'అంటే! ... అన్నది శాంతమ్మ అర్థం గాక...

'అంటే' అని ఆమె ఏదో చెప్పబోతుం డగా, వెనక వంటింటి దగ్గిర గట్టిగా కేకలూ అరుపులూ, దభా దభీమని దెబ్బలూ వినిపించాయి ... అందరం వంటింటివేపు పరుగెత్తాం...

వంటవాడి జుట్టు మా పనివాడిచేతులో వుంది—పనివాడిజుట్టు వంటవాడి చేతులో వుంది — యిద్దరూ మంచి కుస్తీపట్లులో వున్నారు ...



టెలిఫోన్ ఎక్స్‌చేంజ్ ఎదుట, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్.

'హోరి మీ పిర్కిలు దొంగల్లోలా రోజూ మీ యిద్దరికీ యుద్ధమే! జట్లు విడవండిరా ముందు. ఎంత అభిమానం వున్నా బట్టా కొట్టుకుచస్తే ఎట్లా'... అని మా అత్తగారు వాళ్ళిద్దర్నీ సమాధాన పర్చ బోయారు...

'అబ్బే! ఆమె మాటలు వాళ్ల చెవులకు కెళ్ళింది యిద్దరూ పెనుగులాడుతూనే,

'ఏరా! ఏం కూశావ్!... మా యం. జి. ఆర్. యాక్టర్ కాదా!... స్టంట్ మాస్టరా!... యీ వయసులో యం. జి. ఆర్. చేసే యాక్షన్ మీ శివాజీ చేస్తాడంట్రా!— మా యం. జి. ఆర్. గోటికి సరిపోడ్రా మీ శివాజీ...'

ఛపీమని అవతలవాడు ఒకటిచ్చాడు. యం. జి. ఆర్. భక్తుడికి ... తక్షణం ఫడాల్‌మని ఒకటి అంటించాడు శివాజీ భక్తుడికి యం. జి. ఆర్. భక్తుడు... మళ్ళీ యుద్ధం ఆరంభం అయింది... దాంతో వాగ్యుద్ధం...

'మీ శివాజీ పాత కాంగ్రెస్‌కోసం ప్రచారం చేస్తాడా! మొదట శివాజీ డి. యం. కె. లో వుండి డి. యం. కె. వాళ్లవల్ల పైకొచ్చాడ్రా సన్నాసి!...'

'ఏడిశావ్‌లేరా! శివాజీని పైకి ఏవరూ తేనక్కర్లా...ఆయన గొప్పయాక్టరు మొదట్నుంచీ ... మీ యం. జి. ఆర్. కి యాక్టింగ్‌రాదూ పాడూ రాదూ ... యీ వయసులో గూడా వయసు పిల్లల్ని హీరో యిన్లుగావేసి కులుకుతానంటాడా ముసలాడు.

'ఒరేయ్' ఖాలిక చీరేస్తాను ... మా యం. జి. ఆర్. యీ జన్మకి ముసలాడు కాడు...ఆయన డూయెట్ పాడుతుంటే వింటానికి లక్షలాదిజనం పరిగెత్తుతూంటే ఆయన్లో ఎంత ఆకర్షణ వుందో తెలీటంలా!... దేవుడ్రా ఆయన్ని రిక్షావాళ్ళ దగ్గిర్నుంచీ దేవుళ్లా చూస్తారు...ఎలక్షన్లకు ఎంత డబ్బిచ్చాడు! ఎన్ని దానాలు చేశాడు ఎంతమందికి గుడ్డలిస్తాడు మా యం. జి. ఆర్ దానకర్ణుడురా! మీ శివాజీ ఒట్టి పిసినిగొట్టోడ్రా!...

'హోర్నాయ్! మా శివాజీ ఎలక్షన్లకు డబ్బిచ్చాడ్రా!... మా శివాజీ కన్నకు పిల్లలున్నారు... మీ యం. జి. ఆర్. కేవ తున్నార్రా!... పిల్లల్లేనివాడు దానధర్మాలు చెయ్యడం ఏం పెద్దగొప్పరా!... మా

# అత్తగారూ-ఓటూ

శివాజీ అన్నిట్లోనూ వీరుడురా'—

'ఏడిశావ్! మీ శివాజీ వీరుడు కాదురా! పేడిరా ఒట్టి పేడి, అడంగి—కట్టబొమ్మన్ పిక్చర్లో తెల్లదొర్లు మీ శివాజీని ఉరి కంబానికి ఎక్కిస్తే అడదానిలా ఏడుస్తూ ఉరితాడు మెడకి తగిలించుకుని చచ్చాడు... అదే మా యం. జి. ఆర్. అన్న అయితేనా? ఆ ఉరితాడుని మెడదాకా రానిస్తాడా... మధ్యలోనే కత్తితో నరికి పారేయ్యడూ! దెబ్బతో తెల్ల దొర్లందర్నీ చంపేసి తప్పించుకొచ్చేసేవాడు...మా యం. జి. ఆర్. పాదరసంలాగా ఎవరి చేతికీ చిక్కడ్రా!...మా ఎం. జి. ఆర్. హీరోరా హీరో!'...

'మా శివాజీ హీరోరా...'

'మాటల్లోనేరా హీరో మీ శివాజీ— మా ఎం. జి. ఆర్. చేతల్లోగూడా హీరోరా గబ్బిలం మొఖం!...'

'నీదే గబ్బిలం మొఖం...

మళ్ళీ మాట్లాడితే నీది నీ శివాజీదీగూడా పొరకాయ మొఖం.'

'నీదీ నీ ఎం. జి. ఆర్. దే సుమ్మడికాయ మొఖం...'

'నీ శివాజీదే సు(వ్వ)రం మొహం...'

'నీ ఎం. జి. ఆర్. దే మునగకోతి మొఖం'

'నీ శివాజీదే గాడిద మొఖం...'

'నీ ఎం. జి. ఆర్. దే బొప్పాయికాయ మొఖం.'

'పులుసు మొఖం...'

'కుళ్ళు మొఖం...'

'డోలు మొఖం...'

'కూజా మొఖం...'

'బుంగ మొఖం...'

'గంగిరెద్దు మొఖం...

'వమ్ము మొఖం...'

'పుచ్చు మొఖం...'

'ఛీ నోర్మూయ్! పళ్ళు రాలగొట్టేస్తాను..'

'ఏం కూశావ్! నీ పళ్ళు ముందు రాలిపోతాయిరా'...అంటూ మళ్ళీ యిద్దరూ కలియబడి చచ్చేట్టు కొట్టుకున్నారు... శివాజీ ఫోటోవుండే పత్రిక ఎం. జి. ఆర్. భక్తుడు లాక్కుని కసిగా ముక్కలు ముక్కలుగా చించి అవతల పారేశాడు... తక్షణం ఎం. జి. ఆర్. ఫోటోవున్న పత్రిక శివాజీ భక్తుడూ లాక్కుని అంతకంటే కసిగా పొడిపొడిగా చించి అవతల పారేశాడు...

ఆ దృశ్యంచూస్తూ నోటమాట లేకుండా దిగ్భ్రమచెంది నిలబడ్డ మా అత్తగారు ధైర్యంచేసి మీదపడితే పడతాన్లే అని వాళ్ళిద్దరిమధ్యకూ వెళ్ళి వాళ్ళని బలంగా చెరో రెక్కా పట్టి లాగేశారు...

'ఏమిట్రా మీ ఆగడం!...యిదేం యిల్లనుకున్నా! రోడ్డనుకున్నారా!...మధ్య పాపం ఆ యాక్టర్లిద్దరి బొమ్మలూ అట్లా చించి పారేశారే మీకేం పోయేకాలంరా!... నాశ్శనం చేశారని!...అసలెందుకొచ్చింది మీ యిద్దరికీ దెబ్బలాటా!...'

'మీ గురించే పెద్దమ్మగారూ!...'

'మధ్య నా గురించేమిట్రా! నేనేం చేశానూ...'

అంతలో శివాజీ భక్తు డందుకున్నాడు—

'అదికాదు పెద్దమ్మగారూ! మీరు మీ వోటు మా పార్టీకే వేస్తానన్నారు గదూ!...'

'అవునురా! వేశానూ!...'

'అదేంటి పెద్దమ్మగారూ!...మీరింత దగా జేస్తారనుకోలేదే! ఎంతో నమ్మకంగా, నాతో మా ఉదయ సూర్యుడికి అప్పా రూడాకి వేస్తానని ఆ సూర్యుడి సాక్షిగా, మన మీనాక్షి అమ్మసాక్షిగా ప్రమాణంచేసి చెప్పారే!...'

'అవునూ! చెప్పానూ! ... నేనేం తప్పలేదే!'...అని ఆమె అంటూంటే వాళ్ళిద్దరితో బాటు మా మొ ఖా లూ తెల్లబోయాయి...

'అయితే పెద్దమ్మగారూ! యింతకీ మీ వోటు ఎవరెవరికేశారు మీ వోటూ!' అన్నారూ యిద్దరూ ఏకకంఠంగా ... మా అత్తగారు ప్రసన్న వదనంతో.

'అట్లా అడగండి చెప్తాను. పిచ్చివెధవల్లారా! ... దీ ని కీ పోట్లాటెందుకూ!... మీకొకటి చెప్పి నే నింకొకటి చేస్తానట్రా! అందులోనూ మాయింట్లో పనిచేస్తున్న మీకు ద్రోహం చేస్తానా!... నీకు చెప్పినట్లు నీకిష్టమైన రాట్నానికి వేశాను...నీకు చెప్పినట్లు నాకిష్టమైన ఆవూదూడకూ వేశాను...మనకు ప్రత్యక్షదైవం సూర్యుడికీ వేశాను...నేను లోపలికి పోతూంటే అమ్మా నక్షత్రానికి వెయ్యండి అని మామూలా

మిత్రతలకాయ ధ్వజనక్షత్రం...అన్యాయం ఒక మురళి ఆవార్లు. అందుకని చివర్లో ఆ నక్ష త్రం మీదకూడా వోముద్ర వడేసి చక్కా చ్చాను'...అని ఆమె చెప్తూంటే 'హరో హరి గోవిందా గోవిందా!...మీవోటు వేరుగా నక్షత్రాలకే పోయింది...' అన్నారు వాళ్ళిద్దరూ ... శాంతమ్మా నేనూ నవ్వు ఆపుకోలేక చచ్చాం...

'మీకు నెలరోజులుగా చెప్తుందంతా బూడిద చేశారు పెద్దమ్మగారూ.

నువ్వు చెప్పేదేవిటో నే చెప్పలా!...

'ఏమిట్రా! ఏంచేశానూ!—

'మీ వోటు చెల్లదమ్మా!'...

'ఎందుకనిరా!...'

'అన్ని బొమ్మలమీద ముద్దర్లు కొడితే చెల్లదు తల్లీ ...

'ఏడిశాడు! ఎందుకు చెల్లదురా!— ఏవరి కిష్టమైన బొమ్మమీద వాళ్ళ ముద్రలు వేయడానికేగా అన్ని బొమ్మలు వేశారూ!...'

'అది నరేనమ్మా! ... రెండు కాగితా ల్లోనూ. ఒక్కోదాంట్లో ఏదో ఒకటొమ్మ మీద వేయాలి...

'ఆ సంగతి నాకేం తెలుసూ! — మరి రెండు కాగితాల్లోనూ ఏవో రెండుబొమ్మలు వేసి అఘోరించగూడదూ!— చిన్నపిల్లల రెండోక్లాసు పుస్తకంలోలా అన్ని బొమ్మలు వేస్తే ఎవరికైనా తలకాయ చెడిపోదూ!... పైగా మొదటిసారి వోట్లు వెయ్యడానికి వెళ్తేనీ — అదీ మీ ఠిద్దరూ నా ప్రాణాలు తోడేస్తేనే మీ కోసం వెళ్ళాను...అయినా ఆ బొమ్మలన్నీ ఏమిట్రా!...'

'అవన్నీ ఒక్కో బొమ్మ ఒక్కోపార్టీ, అండీ!'

'మరి అన్నిటికీ వేస్తే అన్నిపార్టీలూ రాజ్యానికి రావాలెగాదటమ్మా!...'

'అది కాదండీ! ఎక్కువవోట్లు వచ్చేదే రాజ్యం చేసే పార్టీగా వస్తుంది...'

'ఏం ఎత్తు భారమో! నాకేం తెలుసు ముసల్దాన్ని! ... యింతకీ ఎవరొచ్చారు! పిల్లిట్లా కొట్టుకు చస్తున్నారు!...'

'యింకా తెలీలా ఈ రోజే తెలుస్తాయి ఫలితాలు అదుగో రేడియోలో వార్తలు వినబడుతున్నాయే!' — అని శాంతమ్మంటూంటే పరుగెత్తారు వంటవాడూ పనివాడూ రేడియో దగ్గిరికి...

కాసేపటికి ఎం. జి. ఆర్. భక్తుడు 'వెట్రి! వెట్రి! జయం మదే! జయం మాదే!—మా డి. ఎం. కె. గెల్చింది! — మా ఎం. జి. ఆర్. గెల్చాడు' ... అంటూ ఒళ్ళు తెలీని ఆనందంలో పరుగెత్తుకొచ్చాడు పనివాడు...

'అంటే అదేం బొమ్మరా!...' అన్నారు మా అత్తగారు...

'సూర్యుడమ్మా! ఉదయ సూర్యుడు'—

'మరి నే దానిమీదే వేశాను గదరా ముష్కర!...'

'మీ వోటు శంకరగిరి మాన్యాలుపట్టి పోయిందమ్మా మీది చెల్లని వోట్లలో పడి పోయింది...' అంటూ గబగబవెళ్ళి శివాజీ భక్తుడి చెవ్వు పట్టుకు ల్చాకొచ్చాడు మా ముందుకి...

'చూడండమ్మా!... వీడు నాతో 'బెట్టు' కట్టాడు...డి. ఎం. కె. వోడితే నేను పది రూపాయలు వీడికిచ్చేట్టు... నిజలింగప్ప కాంగ్రెస్ వోడితే వీడు యిరవై రూపాయలు నాకిచ్చేట్టూ...

'యింకా కొసేరా వోట్లు లెక్కపెట్టనీ!— యింకా వున్నాయిగా!— యింతవరకూ డి. ఎం. కె. లీడింగ్‌రా;...కక్కు యిరవై రూపాయలు! ఊ! కక్కు!—'

లేపిస్తూ యిప్పుడు నాదగ్గిర్లేదు...

'చూడండమ్మగారూ! మీరే సాక్ష్యం!... అని నా అత్తగారి దగ్గిరికి కెళ్ళారు...'

'ఆ నాకేం తెలీదు పొండ్రా!...మీ కోసం వెళ్ళి అన్యాయంగా చెల్లని వోటేసొచ్చాను. వెధవపీడా వెళ్ళకున్నా బాగుండేది!... అప్రతిష్ట...యింతకీ తెలీకడుగుతా మరి యీ ఎలక్షన్లెందుకూ! రెండేళ్ళగా మనకు డి. ఎం. కె. ప్రభుత్వమేగా వున్నదీ! మళ్ళీ అదే ఒచ్చిందని ఎగురుతారేమిట్రా!...పున్నదే రావడమేమిటీ!...'

'అబ్బో పెద్దమ్మగారోయ్! మీకు చెప్పేసరికి నా బుర్ర పొద్దు నేపోతున్నా... చిన్నమ్మగార్ని అడగండి చెప్తారు'... అంటూ పనివాడు వెళ్ళిపోయాడు...

'ఏమిటో, యీ వోట్లేమిటో యీ రాజ్యాలేమిటో నాకేం బోధపట్టంలా... బ్రహ్మంగారు వ్రాసినట్లు ఆ వీరభోగ వసంతరాయుడు పుట్టాలి — యీ ప్రపంచాన్ని ఉద్ధరించాలి అంతే...అందాకా యీ అల్లకల్లోలాలూ యీ కొట్లుకోవాలూ తప్పవు ... ఏమంటావు శాంతమ్మా'... అన్నారు మా అత్తగారు..

'అంతేనండీ అంతే!...' అన్నది శాంతమ్మ నావైపు చూసి, యింతకంటే ఆవిడకేం సమాధానం చెప్తాం!...అన్నట్లు... ●

# దేశంలో ఎవరెక్కువమంది?

పాశ్చాత్యులు—హిందూదేశంలో అందరూ శాకాహారులేనని, మాంసాహారులు తక్కువని ఇప్పటికీ అనుకుంటారు. అట్లాగే ఉత్తర హిందూస్థానంలోవుండే ప్రజలు దక్షిణాది వారు మాంసం తినరని, ఎక్కువమంది శాకాహారులని, మాంసాహారం దొరకడం సులభం కాదని అనుకుంటారు. ఈ క్రింది లెక్కలని పట్టి చూస్తే పైవాళ్ళ ఉద్దేశ్యం ఎంత వరకు ఖచ్చితమో తెలుస్తుంది.

| రాష్ట్రం | మాంసాహారం తినేవాళ్ళ నూటికి |
|---|---|
| ప. బెంగాల్, ఒరిస్సా, అస్సాం | 95 |
| మైసూరు | 92 |
| ఆంధ్ర | 90 |
| తమిళనాడు | 85 |
| జమ్ము, కాశ్మీర్ | 82 |
| బీహార్ | 78 |
| కేరళ | 72 |
| మహారాష్ట్ర | 68 |
| మధ్యప్రదేశ్ | 55 |
| ఉత్తరప్రదేశ్ | 52 |
| పంజాబ్ | 50 |
| గుజరాత్ | 41 |
| రాజస్థాన్ | 38 |
| సగటున దేశం మొత్తంమీద | 70 |

అంటే హిందూదేశంలో నూటికి 70 మంది మాంసాహారులని, 30 మంది శాకాహారులని తేలుతుంది.

దక్షిణాదివాళ్ళు ఏమనుకుంటారంటే ఉత్తరాదివాళ్ళు ఎక్కువగా మాంసాహారులని. పై లెక్కలనుబట్టిచూస్తే అంతా 'ఉల్టా'. గుజరాతు, రాజస్థాన్ రాష్ట్రాలలో జైనులు జాస్తి. వాళ్ళలో కొందరు ఉల్లిపాయ గూడా తినరు అందువలన అక్కడ శాకాహారులు జాస్తి అని తేలుతుంది.

కాబట్టి మన దేశం శాకాహార దేశమా, మాంసాహార దేశమా అంటే మాంసాహారదేశమనే ఎక్కువ నమ్మకంతో చెప్పవచ్చు.

—'నా శాలు'




**జరిగిన కథ**

రఘు, రామం, వేణు ముగ్గురూ అన్నదమ్ములు. వాళ్ళ ముద్దుల మరదలు సుధ. సుధ ఒంటిపిల్ల. సుధ తల్లి జానకమ్మ. బర్మానుంచి బాధితురాలిగా వచ్చిన జానకమ్మకి ఆశ్రయమిచ్చారు శర్మగారు. ఆయన భార్య పార్వతమ్మకి సుధ అంటే ఎనలేని అభిమానం. రఘు సుధ మీద ఎక్కువ అభిమానం చూపిస్తూ వుండడం రాధ కనిపెడుతూనే వుంది. రఘుని ఆకర్షించడానికి రాధ హఠాత్ సర్జరీకి విశాఖ చేరుతుంది. మంచి డాక్టరనిపించుకోవాలనీ, లక్ష్యాన్ని సాధించాలని రఘు కోరిక. దగ్గరజేరిన రాధ ఆకర్షణనుంచి తప్పుకుంటూ మనసు లక్ష్యంవైపు కేంద్రీకరిస్తుంటాడు రఘు. సుధ వివాహం కోసం చేసే ప్రయత్నాలు రఘు సలహా మీద జానకి ఆపు చేస్తుంది. రఘు మనసు పరిపరివిధాల పోతున్నది. సుధకి అన్యాయం చేస్తున్నానేమో అని అతను బాధపడుతున్నాడు. సుధ కాలిని ఆపరేట్ చేశారు. సుధ ఇప్పుడు అందరిలాగా నడవగల్గుతున్నది. సుధతో వివాహమైపోయాక రఘు పెద్ద చదువులు చదివి వచ్చాడు. సుధ ఆనందానికి అంతులేకపోయింది.

## 17

ఇంతకే అతనెవరో తెల్సుకున్నారా' ఆ దుర్గా అడిగేడు మురళి.

'లేదు. అడిగితే చెప్తాడేమో తెలియదు. అయినా, మళ్ళీ ఏం ప్రమాదం వస్తుందో నన్న భయంతో అతన్నేమీ అడగడంలేదు సరికదా, అక్కడెవరమున్నా వుంటే ఆలోచన్ని సాగిస్తాడేమోనని తప్పించుకు తిరగడమేగాక, అతన్ని కొంచెం ముగతగా కూడా వుంచుతున్నాం.'

'అయినా ఇన్ని యాతనల్నూపడి ఇంతంత ఖర్చుల్చేసి అతన్ని దినదిన గండంగా కాపాడుకు రావడంలో అర్థం?' రామం అడిగాడు.

'ఒకమనిషిని ఎంతెంత ప్రమాదాల్నుంచి కాపాడగలమో, ప్రమాదవస్థలో వున్న ఒక ప్రాణాన్ని మనుష్య ప్రయత్నాల్తో ఎంతకాలం నిలబెట్టగలమో ఎంతకాలం నిలబెట్టడానికి అసలు వీలౌతుందో—అన్న ఊహాతీతమైన కొన్ని సమస్యల్ని ప్రత్యక్ష పరిశోధనతో నిశ్చయపరచడం. ఇటువంటి పరిశోధనల్లు జరపగల్గేందుకు అది చాలదూ?' అన్నాడు రఘు.

'లేకపోయినా ఇదొక లక్కీఛాన్సనికూడా చెప్పొచ్చు; లేకపోతే ఇలా ఇంత ఎముకలు పాడై చర్మం చీరికలై కూడా వో ప్రాణం ఇలా రెండు పుష్కరాలపాటు ఈడ్చుకొస్తూందీ— అంటే–ఇది మన రఘువంటి వారి అపార పరిశోధనాభిలాష కోసరం వారి శ్రద్ధకిమెచ్చి ఆ దైవం ప్రసాదించిన వో సదవకాశం అనే నిశ్చయించాలి...' అన్నాడు గొప్పగా మొహంపెట్టి రఘు వీపుమీద తడుతూ, మురళి.

'నిజం. లేకపోతే ఎక్కడో అమెరికాలో వున్న ఈ కేసుకు, అనుకోకుండా ఆ దొర సహకారంతో మన రఘు కవకాశం కల్గిందంటే—నిజంగా మనదేశంలోనే అయితే అంతంత వ్యయంతోకూడిన పరిశోధన్లకి అవకాశం చిక్కుండేదికాదేమో కదూ' అంది నళిని.

ఇలా చాలాసేపు. ఆ అపూర్వ వ్యక్తిని గురించే వ్యాఖ్యానాల్చేసుకుని..సెలవొక్కటే వెళ్ళిపోయారు మళ్ళీ.

రఘు వున్న ఆ వారం రోజులూ, సుధకీ, మిగతావారికీకూడా ఏడు రోజులూ ఏడు ఘంటల్లా సుఖంగా సరదాగా గడిచిపోయాయి. ఈసారి రఘు వెళ్ళేటప్పుడు సుధని వదిలి వెళ్ళడానికి చాలా బాధపడ్డాడు.

'ఏమిటి బావా, ఈ పరీక్షలైపోగానే నేనూ రెక్కలు కట్టుకునొచ్చి నీ పక్కని వాల్తా! ఇంకెంత? తొందరగా. ఆరు నెలలే!' అంటూ సుధే రఘుని సమాధానపెట్టి 'ప్లేన్' ఎక్కించింది.

'ఏయి చెల్లెమ్మా, ఇన్ని ఆటపాటాన్నూ మీ ఆయన తెచ్చాడుగానీ మా బావొక్కడూ, ఇన్నింట్లోటీ ఆడుకోలేదు సుమా'అంటూ మళ్ళీ హాస్యాలు ప్రారంభించింది శాంత. అయితే ఈసారి సుధ శాంత మాటలకేమీ అనుకోలేదు సరికదా, ఈసారి తనక్కల్గిన వికారాన్ని కాంతుల్నిచూసి హేళనచేసిన శాంతని పిచ్చిదాన్నిగా లెక్కగట్టలేదు సుధ.

ఇక శర్మగారి ఆనందానికీ పార్వతమ్మగారి ఆనందానికీ మేరేలేదు. ప్రతి వారం నళిని వచ్చి సుధ శరీరపరిస్థితిని స్వయంగా పరిశీలించి వెళ్తూండేది. సుధ తనూ డాక్టరే అవడంవల్ల ఆరోగ్యపద్ధతుల్ని శ్రద్ధగా పాటిస్తూండడంవల్ల సాధారణంగా గర్భవతులకు కలిగే చిల్లరనుస్తీలేవీ లేకుండా హాయిగా వుంటూ శ్రద్ధగా చదివి పరీక్షలకి హాజరయింది.

'అమ్మయ్య ఇక మీ ఆయన పెట్టిన నిబంధనలన్నింట్లోనూ జయించినట్టేనా తల్లీ?' అంది ఈ ప్రయాసంతా తనే పడిపోతున్నట్టుగా మొహం పెడుతూ శాంత.

'ఉండక్కా, ఇంకా పరీక్షా ఫలితాలు తెలియద్దూ.'

'ఆ. అందులో నీకు డౌటేం వుంటుందిలే గానీ, అన్నమాటని అక్షరాలా నిలబెట్టుకుందుకు మీ ఆయనకి మీ ఆయనే సాటి చెల్లెమ్మా. ఇంత ఇన్ని విధాలా నిగ్రహంగల మనిషిని తననే చూశాం చెప్పొద్దూ' అంటూ శాంత రఘుని మెచ్చుకుంటూంటే సుధ కళ్ళల్లోంచి ఆనందభాష్పాలు జలజలా రాలాయి. సుధ అంత చదువుకున్నదయినా పెద్దవాళ్ళు సాంప్రదాయంగా చేస్తూండే గాజులు పెట్టడం, పూలముడుపూ మొదలైన ముద్దు

మిచ్చేట్లు వారు జరిపించుకుంటుకేవిధ మైన అభ్యంతరమూ తను చెప్పలేదు.

'ఇదుగో వచ్చేస్తున్నా, ఇదుగో వచ్చేస్తున్నా' అని రాస్తూనే సుధని ఆరోగ్య విషయాన్నిగురించి హెచ్చరిస్తూ ప్రతివారం రఘు ఉత్తరాలు రాస్తూనే వున్నాడుగాని రానే లేదు.

ఈలోగా సుధ చక్కని కొడుకుని కనేసింది. పాప పుట్టిన పదిహేనోజులకి రఘు వచ్చాడు. వస్తున్నా వస్తున్నా అంటూ రాసినప్పుడల్లా రాని రఘు ఏముందు కబురూ లేకుండా అలా అధాత్తుగవొచ్చి దిగడం చూసి అంతా ఆశ్చర్యంలోనూ ఆనందంలోనూ మునిగి తేలిపోయారు.

కారు దిగడంతోనే తనుమాత్రం ముందు గబగబా లోపలికొచ్చిన రఘు ఎదుటపడ్డ సుధనిచూసి 'సుధా ముందువెళ్ళి అత్తయ్యకు కుంకుమ బొట్టుపెట్టు త్వరగా' అని సుధని హెచ్చరించేసి, ఆ కొత్తగా వొచ్చిన నడి వయస్కుణ్ని కార్లోంచి దింపడంలో తండ్రికి సాయపడ్డంకోసరం ఒక కుర్చీ తీసుకుని పోర్టికోలోకి పరుగెత్తాడు.

సుధకి భయఆశ్చర్యా లొక్కమాటే మనసు నలుముకున్నందున ఏం చేస్తున్నదీ తనకే తోచక కొన్నేపలాగే నిలబడిపోయి ఆ తరవాత లోపలికి పరుగెత్తింది విషయాన్ని ఊహించుకుంటూ.

'అమ్మా, నీ నుదుటి తిలకాన్ని దైవం చెరపలేదమ్మా, ఇదంతా ఒక పీడకల' అంటూ భగవద్గీత పారాయణ చేసుకుంటూన్న తన తల్లినుదుట దేవీప్రసాదకుంకాన్ని బొట్టుంచి గబగబా ఆవిణ్ని లేవదీసుకుని ముందరి హాల్లోకి పరుగెత్తింది సుధ.

సుధ చర్య తనకేదో అయోమయంగానే వున్నా చైతన్యం లేనిదాన్లా సుధ తీసుకెళ్ళినట్టూ వెంట వెళ్ళింది జానకి.

'జానకీ?' కుర్చీలో కూర్చుని తన అక్కగారి గుండెలకి తల ఆనుకుని చెరవడున్న పళాన్నే చేతులుమాత్రం ముందుకు చాచాడు, నిస్త్రాణగా కూర్చునున్న సుధ తండ్రి శ్రీధర్. పగిం పగిం తల పండు నడివయసునిని చూచిస్తున్న జానకిలోని మార్పుకి ఆశ్చర్యపోతూ, కొన్నిక్షణాల పాటు అతన్నే చూస్తూ నిలబడ్డ జానకి ఆనందం దుఃఖం కలిసి తనని ఉక్కిరి బిక్కిరి చేసేస్తూంటే, తడబడుతూన్న పాదాలో అతనిముందు మోకరిల్లి, అతని వళ్ళో మొహం దాచుకుంది జానకి.

'తల్లీ, నిన్నుగురించి నే కన్న కలలు— నా బంగారుతల్లీ' సుధని బలవంతంగా తన ఒళ్ళో కూర్చోపెట్టుకుని గుండెలకి హత్తుకుంటూ కన్నీరు కార్చారు ఆ పునర్జన్మెత్తి తిరిగొచ్చిన సుధ కన్నతండ్రి.

'బావా? నువ్వూ అక్కయ్యా చేసిన ఈ,'

'బాబూ వచ్చిందగ్గర్నుంచీ నువ్వు ఇదే మాటంటూండడం మాకేమి బాగుండలేదు. ఏదో ఒకసారి అన్నావు బాగుంది.' అని మందలించారు శర్మగారు.

'అలాగనకు బావా, రఘు, వాడెంత మహోపకారం నాకు చేసి నా చిన్నవాడు వాణ్ణి నే పొగడకూడదని నోరు మూసుకున్నాను—'

'ఇలా చూడు తమ్ముడూ, ఇందులో ఎవ్వరం పరాయివాళ్లం కాదునువ్వంతగా ఇదవడానికి.' అంటూ అతని తలనిమిరి అతనిలో వచ్చిన రూపు మార్పునిమాపి



పార్వతమ్మగారికి అలవాటు. అతి పవిత్రమైన ఈ ఆచారాన్ని ఆవిడ అత్తగారివద్దచూసి అలవరుచుకున్నారావిడ.

ఆ సాయంత్రం తమ్ముణ్ని · మరదల్నీ కొడుకుల్నీ కోడళ్లనీ, అందర్నీ తీసుకుని తాము దంపతు లిద్దరూకూడా తమ ప్రత్యక్షదైవం ఆ లలితాంబ గుడికి వెళ్లి దర్శనం చేసుకొచ్చారు ఆవిడ. ఒక వారంరోజులిలా కులాసాగా జరిగిపోయాక తమ ప్రయాణాన్నిగురించి ప్రస్తావించాడు. ఒకరోజు రాత్రి సావకాశంగా అందరూ కూర్చునున్నప్పుడు రఘు.

'సుధనికూడా తీసుకు వెళ్తావా' పార్వతమ్మగా రడిగారు.

'ఆ దానికి హౌస్ సర్జెన్సీగా అక్కడే చేసుకుంటే మంచిదని.'

'బాగానే వుందిగాని మరి బాబుని పెంచటమో.'

'బాగుందత్తయ్యా మీ రడగడం, అమ్మా నాన్నా డాక్టర్లయినప్పుడు బాబు పెంపకాని కిక ఇంకేవిటి మీకూ' అంది శాంత.

'పోనీ మాదగ్గరొదిలి వెళ్లండి.' శ్రీధర్ అన్నారు.

'అబ్బే, నో నర్సుని పెట్టేస్తాం' సరదాగా చెప్పాడు రఘు.

'అన్నట్టు ఇక ఈ గొడవలన్నీ మవ్వు అందుకున్నావంటే, నాకు విశ్రాంతి' అన్నారు

# అతనే లక్ష్యం

ఆఫీసు గదివేపు చూపిస్తూ శర్మగారు.

'ఆ మాటలా వున్నా ప్రస్తుతం ఇద్దరం సంపూర్ణ యాత్రలకు బయల్దేరాలని అనుకుంటున్నాం ఇల్లు మీ కప్పగించి' అన్నారు పార్వతమ్మగారు.

'మహారాజులాగ, దానికేం?' అన్నాడు శ్రీధర్.

'మరి మొన్న చిన్నమరిది కొచ్చిన సమ్మంధం మాటేం చెప్పారూ.'

'మీరంతా వున్నారుగా, మాటలూ, చూపులూ, జరిపించండి ఈలోగా వస్తాం' అన్నారు శర్మగారు.

అనుకున్న ప్రకారం వారి యాత్రలకి కావలసిన ఏర్పాట్లన్నీ జరిపించబడ్డాయి. రఘు కుటుంబ సహితంగా బొంబాయి వెళ్లేందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చేసి వారి క్కావలసిన వస్తు సామగ్రులన్నీ కొని సిద్ధపరిచారు. వారితో జానకీ, శ్రీధరూ కూడా వెళ్లి, అన్ని ఏర్పాట్లూచేసి తిరిగి వచ్చాక శర్మ దంపతులు యాత్రలకి బయల్దేరడం అని స్థిరపరిచారు.

రఘు అక్కడున్న ఆ నెలరోజులూ విందులోనూ వినోదాల్లోనూ ఎంతో కులాసాగా కాలక్షేపం అయిపోయింది.

ఆ రోజు వారి ప్రయాణాన్నుద్దేశించి

ఒకటే హడావిడిగా వుంది. శ్రీకాంతాను వేణు తను చేసుకోబోయే పిల్లని సుధా, రఘూ, ముందుగా చూసి అభిప్రాయం చెపితేనేగాని వీల్లేదన్నందున వారు రైల్లోనే హైదరాబాద్‌వెళ్లి ఆ పిల్లని చూసేసి అక్కణ్నుంచి బొంబాయి వెళ్లడం అని ఏర్పాటయింది.

రఘూ దంపతుల్ని సాగనంపేందుకు ఆ వూరంతా తరలి వచ్చారేమో. 'అన్నంత మంది జనం వున్నారు ఆరోజు రైల్వే స్టేషన్‌లో.

రఘు సుధా మొదలైన వారంతా వారికింతటి అదృష్టాన్ని అనుగ్రహించిన ఆ లలితాంబని దర్శించుకుని స్టేషన్కి రావడంలో కొంత ఆలశ్యమయి పోవడంవల్ల బాబు నెత్తుకుని గబగబా వచ్చి రైలెక్కిన జానకి కిటికీవద్ద సోఫాకి చేరబడున్న తన భర్తచేతికి బాబునిచ్చి తనూ ఆయనపక్కన కూర్చుంది.

అసలే ఆలశ్యమయి పోయినందువల్ల దబదబా తమకోసరం కనిపెట్టుకున్న మిత్రబృందానికి కరస్పర్శలు గావించేసి రైలెక్కి, ప్రియారు మొయ్యలేనన్ని పూలమాలల్ని మోసుకుంటూ రఘూ సుధాను. రయిలు కదలింది. అందరూ ఆనందంవల్లా ఎడబాటువల్లా కలిగిన కన్నీళ్లు తుడుచుకుంటూ టాటా బైబై చెపుతూ వుమాళ్లగ చేస్తున్నారు.

అందరిమధ్యా నిలబడి యంత్రంలా తనూ వగరేస్తున్న రాధకి కదలి వెళ్లి పోతూన్న రైలుపెట్టె వాకిట్లో నిలబడి నవ్వుతూ అందరికీ నమస్కరిస్తూన్న రఘునీ, సుధనీ చూసేసరికి ఆరోజు తను బొంబాయి వెళుతూన్నపుడూ ఇలాగే నిలబడి దీనంగా ఒకవార నిలబడున్న సుధని చూసి 'నీబతుకిక ఇంతేలే?' అన్నట్టు నిరసనగా చూసిన సంగతి గుర్తుకొచ్చి బాధగా తలొంచుకుంది.

దాంతోపాటు బొంబాయిలో రఘు తనకి లొంగలేదన్న అహంకారం కొద్దీ అతన్ని అవమానపరిచాలన్న అమోదుతో చంద్రకాళి స్నేహాన్ని ఆసరా చేసుకుని తను చేసిన






అనంభవాన్ని ప్రయత్నాలూ అందుగా ను 'తనకి భగవంతుడే బుద్ధి చెప్పినట్టు కటువైన ఆ ఇబ్బందులూ అన్నీ గుర్తు కొచ్చి అవమానంతో కుమిలింది మనసు.

అయితే తను అందలంమీద ఉంచిన్నాడూ అథఃపాతాళంలోకి తోసిన్నాడూ కూడా తన ప్రవర్తనని. ఏపాటీ లక్ష్యం చెయ్యకుండా విశాల దృక్పథంతో తన విధాయకాల్ని తను చూసుకుంటూ తన లక్ష్యాన్ని తను కాపాడు కున్నాడు రఘు.

మనుష్య జన్మంటూ ఎత్తాక కార్యదీక్షా మనోనిగ్రహం గుండెనిబ్బరం వీట్లని ఆధారం చేసుకుని ప్రవర్తించినవారే ప్రపంచంలో ఆదర్శనీయులవుతారనే సీతికి నిదర్శనం రఘు. గీటు రాయివంటిది రఘు కార్యదీక్షా శీలత్వం. అయితే తనో? అతని పవిత్ర చరిత్రని తల్చుకుందుకూ్కడా అర్హత లేదేమో తనకి.

'హు. ఎన్నెన్నో హృదయ చాంచల్యాలు కల్గాల్సిన సందర్భాలలో నూ ఎంతెంతో మనోనిగ్రహంతో, భీష్మించు కూర్చుంటూ, ఎందరెందరో గొప్ప గొప్ప విద్వాంసులూ, మంచిమంచి అందగత్తెలూ. తనని వలచి చుట్టూ తిరుగుతున్నా వారందర్నీ 'తృణీకరించేస్తూ విశ్వలంగా కాలక్షేపం చేసుకొస్తూండే ఈ రఘుని చూపినప్పుడల్లా,

'ఇంత రసికత్వం ఎరగని మనిషేమిటూ తడూ, అని చిరాకు పడేతను.

అయితే ఈ అవిటిపిల్లని అందరికంటె రూపవంతురాల్నిగానూ, విద్యావంతురాల్ని గానూ, తయారించుకుని. ఈవిణ్ణే పెళ్లి చేసుకుని ఇటువంటి దైవీకమైన స్వతంత్రమైన తృప్తికరమైన ఇటువంటి ఆనందాన్ని ఆవిడతో పాలుపంచుకోవాలన్నదా? ఇతనియొక్క ఏకైకలక్ష్యం ?...' అని అనుకుని పరమానందం పొందుతూ ఆరి ఆనందాన్నలాగే తన హృదయంలో స్థితించుకుంటూ తనని మరచి, స్థలాన్ని మరచి సర్వాన్నీ మరిచి నిలబడ్డచోటనే అలాగే నిలబడి వుండిపోయింది రాధ..

(అయిపోయింది)●

# ఉత్త చేతులతో........



బులుసు వెంకటరమణయ్య. ధర్మపథం

మన దేశంలో పురాతన కాలంనుంచీ వస్తున్న కొన్ని సంప్రదాయాలూ. అలవాట్లూ వున్నవి. పెద్దలువస్తే, కూర్చున్న చోటునుండి లేచి నమస్కరించడం మొదలైనవి వీటిలో చేరుతాయి. ఇలాటివి ఇతరులను గౌరవించడంతోపాటు తమ శీలాన్నికూడా తెలియజేస్తాయి.

ఇట్టి వాటిలో ఉత్తచేతులతో వెళ్లకుండా. ఏవయినా—వస్తువులనో, పండ్లనో—చివరకు పుష్పాలనో తీసుకుని వెళ్లడం ఒకటి. ఎట్టి చోట్లకు రిక్తహస్తాలతో వెళ్లకూడదో — ముఖ్యమైనవాటిని మన పూర్వులు నిర్ణయించారు. వారు చెప్పిన దిది—

'అగ్నిహోత్రం గృహం క్షేత్రం
గర్భిణీం వృద్ధ బాలకౌ.
రిక్తహస్తేన నోపేయాత్
రాజానం దైవతం గురుమ్.'

'అగ్నిహోత్రాన్నీ, గృహాన్నీ, క్షేత్రాన్నీ ఉత్తచేతులతో చేరకూడదు. గర్భిణీ స్త్రీలనూ; వృద్ధులనూ; బాలులనూ, రాజునూ, దేవునీ, గురువునూ చూడడానికి వెళ్లేటప్పుడున్నూ ఉత్త చేతులతో పోకూడదు.' అని దీని అభిప్రాయం.

ఇలా చెప్పడంలో ఎంతో ఔచిత్యం, మనస్తత్వ పరిశీలన కానవస్తున్నవి.

పూర్వం ఇప్పటిలాగ తలచుకున్న వెంటనే అగ్నిని ఉత్పాదించే అవకాశం వుండేది కాదు. దానికెంతో శ్రమపడాలి. అందువల్ల దాన్ని ఆరిపోకుండా చూచుకోవలసి వుండేది. అక్కడికి వెళ్లేటప్పుడు సమిధనో, కొంచెం ఆజ్యాన్నో తీసికొని వెళ్లితే దానికి ఇంధనంగా ఉపయోగ పడుతుంది.

గ్రామాంతరంనుంచి గాని, పొలాన్నుంచి గాని వచ్చినపుడు కూరగాయలో, ఇతర వస్తువులో చిన్నమూట కట్టుకొని తీసుకు రావడం అప్పుడు పరిపాటి. యజమాని యింటికి వచ్చేటప్పుడు 'ఏదో తీసుకు వస్తారు గదా!' అని ఎదురు చూడడం కొత్త కాదు. ఉత్త చేతులతో ఇంటికి వెళ్లితే తనకూ నిరుత్సాహమే! ఇంట్లోవారికీ నిరుత్సాహమే.

క్షేత్రాలకు భక్తులువెళ్లి, పుణ్యంకోసం అనేక దానధర్మాలు చేస్తూ వుంటారు. వీటి మీదనే ఆధారపడి అక్కడి కొన్ని కుటుంబాలవారు ఉంటారు. వాళ్లను తృప్తిపరచుటకు గాని, తనకు తృప్తి కలగడానికిగాని ఏమయినా తీసుకుని వెళ్లవలసి వుంటుంది. దాన ధర్మాలకోసం.

గర్భవతులకు వివిధ రుచులపైని ఆశ ఎక్కువ. రుచిగలవాటిని తినాలనే కోరిక వుంటుంది. ఆమె నిరుత్సాహాన్ని పొందకూడదు. గర్భిణి సంతోషంగా వుండేటట్లు చూచుకోవాలి.

అరవైయేళ్లు దాటాక మనిషికి మళ్లీ వయస్సు ప్రారంభ మవుతుందన్న మాట. బాలునివలెనే వృద్ధుడూ అశక్తుడే! జిహ్వా చాపల్యమూ అధికమే! సంపాదించుకునే శక్తి లేకపోవడం ఇద్దరికీ సమానమే? స్వల్పంగా ఇచ్చినా ఇద్దరూ ఎక్కువ సంతోషిస్తారు. ఇవ్వకపోతే వృద్ధుడు మనస్సులో బాధపడుతాడు. బాలుడు దాన్ని బహిరంగంగానే తెలుపుతాడు. పిల్లలకు మిఠాయి తీసుకు వెళ్లడం అందరికీ పరిపాటే.

రాజులు కరగ్రాహకులు. పన్ను [illegible] చేసేవారు—(దాన్ని ప్రజలకోసమే [illegible] గిస్తారనుకోండి!) ఫలాన్నో, పుష్పాన్నో

(64వ పేజీ చూడండి)

# అమెరికాలో నల్లమందు అలవాటు

అది నేను అమెరికాకి వచ్చిన 4 వ రోజు. ఆరోజు నేను నైట్ డ్యూటీలో ఉన్నాను. అర్ధరాత్రి డ్యూటీ రూమ్‌లో గాఢ నిద్రలో ఉండగా ఫోన్ మోగింది. 'డాక్టర్, ఆక్సిడెంట్ కేస్ ఒకటి యిప్పుడే అడ్మిట్ అయింది. వెంటనే రావాలి' అని అవతలనుంచి నర్స్ కంఠం వినిపించింది. వెంటనే అదరాబాదరాగా దుస్తులు వేసుకుని పరిగెత్తాను.

వార్డులో కదుగుపెట్టగానే కనిపించిన దృశ్య మిది. 'రక్తపుమడుగులో ఒక యువకుడు పడి ఉన్నాడు. పొడుగాటి జుత్తు, పెరిగిన గడ్డముకూడా అతని రేత మొహాన్ని దాచలేక పోతున్నాయి. నర్స్ చెప్పింది— 'అతను హైవే మీద 70 మైళ్ళ వేగంతో కారుతోలుతూంటే యీ ప్రమాదం జరిగిందట. 'మరి ఈ పొడుగాటి జుత్తు, యీ గడ్డం ఏమిటి?' అని అడిగాను. మీకు తెలియదా? అని ఆశ్చర్యంగా నావేపు చూసి యిలాంటివాళ్ళను హిప్పీలు అని అంటారు. వీరికి మందు అలవాట్లు ఉంటాయి అని చెప్పింది. సరే నేను సైలెన్ నరాలలో గుండా ఎక్కిందామని ప్రయత్నిస్తే మోచేతి దగ్గర అంతా గంట్లు పడిఉన్నాయి. తర్వాత తెలిసింది— నీరు యీ నరాల ద్వారా యీ 'మందును నరాలలోకి ఎక్కించుకోవడంవలన యీ నరాలన్నీ గంట్లు పడిపోతాయని. మొత్తానికి ఆ రోజురాత్రి చేసిన ఆపరేషన్ జయప్రద మవడంవలన ఆ కుర్రవాడు మృత్యుముఖంనుండి బయట పడ్డాడు.

మరునటి రోజు ఆ కుర్రవాడిని చూడడానికి వార్డుకు వెళ్లాను. బాగానే మాట్లాడాడు. కాని అలసట, బలహీనతవలన ఎక్కువసేపు మాట్లాడలేకపోయాడు. నాలుగు రోజుల్లో బాగా తేరుకున్నాడు.

ఆ రోజు రాత్రి ఎందుకో నాకు అతనిలో నల్లమందు అలవాటును గురించి అడిగి తెలుసుకోవాలని పించింది. రాత్రి 9 గంట అయింది. బయట బాగా మంచు పడుతుంది. హాస్పిటల్‌లో హీటర్లు సరిగా పనిచేయడం లేదు. చిరు చలిగా ఉంది. అతని గదిలోనికి అడుగు పెట్టాను. నన్ను చూడగానే పుస్తకం చదువుతున్నవాడల్లా అవతల పెట్టాడు. అతనితో నాకు జరిగిన సంభాషణ ద్వారా తెలుసుకొన్న విషయాలు ఎలాంటి అమెరికన్ తలిదండ్రుల కైనా భయకంపితులను చేస్తాయి.

నేనే సంభాషణ ప్రారంభించాను.

పీటర్, నిన్ను నేను ఒక ప్రశ్న వేస్తాను. ఏమీ అనుకోవుగదా?

ఫరవాలేదు. అడగండి.

నీవు ఈ పొడుగాటి జుట్టు గడ్డం నిజంగా ఇష్టమేనా?

ఏమో! నాకు తెలియదు. మా క్లాసులో అందరు పిల్లలు ఇలాగే జుట్టు పెంచుకొంటారు! అందుకనే నేనూ పెంచుకొంటాను. అవి లేకుంటే [illegible] ఏమి?

తప్పేమన్నా ఉందని నేను అనలేదే!

కాని మీరంతా నాలాంటి వాళ్ళవేపు విచిత్రంగా చూస్తారు. నాకు తెలుసు, మీరు మమ్మల్ని అసహ్యించుకుంటారని. యింకొకరికి హాని కలిగించనంతవరకు నేను పొడుగు జుట్టు పెంచుకోడం వలన ఏమీ ప్రమాదం లేదు.

సరే ఒప్పుకొన్నాను. నీవు హెరాయిన్ [నల్లమందు] యింజక్షన్ తీసుకోవడం నిజమేనా?

ఒక్క క్షణం ఆలోచించాడు— పోలీసులకు చెప్పవు గదా?

చెప్పను. నీవు చెప్పేది ఎవరికీ చెప్పను.

నిజమే. నేను హెరాయిన్ యింజెక్షన్ తీసుకొంటాను.

దేనికి తీసుకొంటావు?

ఏమో నాకు తెలియదు. నాకు అలవాటు. అంతే.

నీకు అలవాటు ఎలా అయింది?

మా క్లాసులో అందరూ తీసుకొంటారు. నాకు తీసుకోవాలనిపించింది. అసలు ఈ అలవాటుగురించి తెలుసుకోవాలని ఓపిక ఉంటే చెప్తాను వినండి.

నర్స్‌కు ఫోన్‌చేసి, నేను ఉన్న టెలిఫోన్‌నంబర్ యిచ్చి ఏమన్నా కేసులు వస్తే పిలవమని చెప్పి తాపీగా సోఫాలో కూచున్నాను.

పీటర్ ప్రారంభించాడు. అప్పుడు నాకు 12 ఏళ్ళు. మా సీనియర్ క్లాసులో ఒకరిద్దరు తప్పించి మిగతా పిల్లలందరు ఎప్పుడూ ఉషారుగా ఉండడానికి ఏదో యింజెక్షన్, మాత్రలు తీసుకొంటూ వుండి ఉన్నారు. కాని నాకు ఎందుకో తీసుకోవాలనిపించలేదు.

ఒకరోజు సాయంత్రం ఐదు గంటలయింది నేను క్లాసురూములో నుంచి బయటకివస్తున్నాను. నాసీనియర్ జోసెఫ్ ఒక 30 ఏళ్ళ యువకునితో ఒక మూల రహస్యంగా ఏదో మాట్లాడుతున్నాడు. నన్ను చూసి ఆదరకంగానవ్వి, అయువకునికు పరిచయం చేసాడు. అతను నావేపు మాటిగా చూస్తూ నాదగ్గర మంచి గ్రాస్(గడ్డి)ఉంది. మెక్సికో నుంచితెప్పించాను. తీసుకుంటావా? అని అడిగాడు. నేను గ్రాస్ అంటే ఏమిటి అని అడిగాను. గ్రాస్ అంటే తెలియదా? అని భుజం తట్టి నాకుబూడిద రంగులో ఉన్న సిగరెట్ ఒకటి యిచ్చాడు. అంతకు ముందు చాలా మార్లు మాసీనియర్లు అలాంటి సిగరెట్లు తాగడం చూచాను ఒకమారు తాగితే ఏమవుతుంది అనుకొని ఆసిగరెట్ భద్రంగా పదిలపరచుకొని, జోసెఫ్‌తో బాటు వాళ్ళయింటికి వెళ్ళాను. వాళ్ళయింట్లో వాళ్ళందరూ పిక్నిక్‌కు వెళ్ళారు. జోసెఫ్ నాసిగరెట్ ముట్టించాడు. గట్టిగా పొగ లాగి బయటకు వదిలాను. యిలా రెండుమూడు మార్లు చేసాను.

అంతే నాలోని నరాలన్నీ ఉప్పొంగాయి. నాలోని ప్రతిఅణువునవచైతన్యంలో ఊగిసలాడింది. నామనసు కాంతికన్నా వేగంతో ప్రయాణం చేసి ఏదోబహు రమ్యమైన లోకంలోకి వెళ్ళిపోయింది. నాకునిజంగా దీనిని ఎలా వర్ణించాలో తెలియదు. కాని జీవితంలో అంతకన్నా మధురక్షణం ఉండదని అప్పుడు అనిపించింది. (ఈ క్షణంకోసమే చాలా మందిఈమందును తీసుకొంటారు.) యీవిధంగా ఒకటి రెండు నిమిషాలు ఉంటేనేమో.

వెంటనే అతిత్వరగా అస్వర్గాన్నుంచి దిగజారడం ప్రారంభించాను. ఏమిటో అర్థం కాని విస్మృతి నశరీరాన్ని ఆవరించింది. జీవితంమీద ఏదో విరక్తి నిరాశ కలిగాయి. ఆకలి అసలే వేయడం లేదు., తర్వాత నాకు తెలిసింది. యీ నిరాశా భావమువలనేనేమో యీ అలవాటు ఉన్నవారు దుస్తులమీదఆసక్తి చూపించరు, చిరు మాసిపోయిన దుస్తులతో, తైల సంస్కారంలేని జుత్తుతో, చెప్పులు లేకుండా తిరుగుతుంటారు. కాని ఏమిటో జీవితమంతా యిలాగే గడిచిపోతే బాగుండు ననిపించింది. యీ విధంగా నాలుగు గంటలతరబడి ఉన్నాను. జోసెఫ్ యింకో సిగరెట్ అందించాడు. యాంత్రికంగా తీసుకొన్నాను. ఆరోజు అలాగే మూడు సిగరెట్లు తాగాను. యింటికి చేరేటప్పటికి తెల్లవారు జామున 5 గంటలయింది. మా అమ్మగారు తలుపు తీసారు. ఆరోజుకు ఏమీ అనలేదు యీ సిగరెట్లు తాగడం తప్పని తెలిసినా, ఏమిటో నెమ్మదిగా అలవాటుగా పోయింది అని పీటర్ మంచి నీళ్ళు తాగడానికి ఆపాడు.

**దీని పుట్టుక**

యీ నల్లమందు పుట్టుక పువ్వులోనించి, యీ చెట్లును పపావర్‌సొమ్నిఫెరమ్ అని అంటారు. ఇది ముఖ్యంగా మెక్సికో, టర్కీ, థాయిలాండ్, ఆఫ్రికాదేశాలలో పండుతుంది. అమెరికాకు వచ్చేసరుకు ముఖ్యంగా టర్కీనుంచి దిగుమతి అవుతుంది. అమె



లికా ప్రభుత్వం, యూరోపియన్ ప్రభుత్వాలకు ఆర్థిక సహాయం చేసినప్పుడు, వాటికి షరతులు పెట్టేందుకు ఈ చిట్టాను ఉపయోగించేందుకు ప్రయత్నం చేసింది. నల్లమందు సాగు కట్టుమని టర్కీ ప్రభుత్వానికి చేసినఅభ్యర్థనలకు టర్కీప్రభుత్వం ప్రాముఖ్యం యివ్వలేదు. ముడి పదార్థ రూపంలో ఉండే నల్లమందు ఫ్రాన్స్‌లోని ప్రయోగ శాలలో పరిశుభ్ర పరచబడుతుంది. యిది వేరు వేరు రూపాలలో ఉంటుంది. ముఖ్యమైనవి, సిగరెట్ల రూపంలో, పొడిరూపంలో. యీ పొడిని మరగకాచి యింజెక్షన్ రూపంలో నరాల లోనికి తీసుకొంటారు. యింజెక్షన్ సూదులు సాధారణంగా వైద్యుని ప్రిస్క్రిప్షన్ లేనిది దొరకవు. నేను చాలమంది పిల్లలు వైద్యశాలల బయట చెత్తపోగులలో యీ సూదుల కోసం వెదకడం చూసాను. కాబట్టి యిప్పుడు దాదాపుఅమెరికాలోని అన్ని వైద్యశాలలో యింజెక్షన్ యివ్వగానే సూదులను విరగగొట్టి ఒవతల పారేస్తారు.కాని యీ పిల్లలు సూదులను ఎలాగో సంపాదిస్తారు. సిరంజి బదులు యింక్ ఫిల్లర్ వాడటం చూసాను. యీ మధ్య ఒక హిప్పీపేటలో ఒకకుర్రవాడు అకురాయి మీద ఒక సూదిని సాదడం చూసి ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాను. అతను సూది పదునుగా ఉందో లేదో నాలికమీద రాచుకొని చూసి, జేబు లోనుంచి మందు తీసి, సూదిద్వారా తన మోచేతి నరం లోనికి అవలీలగా ఎక్కించుకొన్నాడు. నావళ్ళు జలదరించింది. సూదులను వేడినీళ్ళలో ఉడికించకుండా యింజెక్షన్ తీసుకోవడమా! యింక నేను ఆలోచించలేక పోయాను.

[నేను యిప్పటివరకు వేలకొలది నరాల యింజెక్షన్లను యిచ్చి ఉండవచ్చు, కాని అంటు వేను అంత ధైర్యంగా తీసుకోలేనను కొంటాను.]

వీరు యీ విధంగా అపరిశుభ్రమైన సూదుల ద్వారా యీ మందు నరాలలోనికి ఎక్కించుకోవడం వలన అనేక ప్రమాదాలు ఉన్నాయి. జీవక్రిములు (బాక్టీరియా) రక్తంలోనికి ప్రవేశించడం వలన సిరి కాలేయము దెబ్బతినవచ్చు. లేక యీ క్రిములు నేరుగా మెదడులోనికి చేరి సన్నిపాతజ్వరం వచ్చి నిమిషాలమీద వీరు మరణించవచ్చు. [ఇన్ని వింటే మీకు వళ్ళు కూడా జలదరిస్తుందను కొంటాను! యింక యిలాంటివి చెప్పడం మానేస్తాను!] పోయిన సంవత్సరము ఎక్కువ నల్లమందు తీసుకోవడం వలన న్యూయార్కు నగరములో 224 మంది మరణించారు.

**దీనిని అరికట్టడానికి అమెరికా ప్రభుత్వం ఏం చేస్తూంది?**

దీనికి ప్రత్యేకంగా ఒక శాఖ వినియోగించబడింది. కాని దీనిలో సి. ఐ. డి. ఆఫీసర్ల సంఖ్య చాలా తక్కువ. దేశం మొత్తానికి 850 మంది ఉన్నారు. న్యూయార్కు నగరానికి 14 మంది మాత్రమే ఉన్నారు. [సముద్రంలో కాకి రెట్ట!] వీరికి కూడా చేయిని తడిపించుకొనే అలవాటు ఉంది. 1969 లో 14 మంది సి. ఐ. డి. ఆఫీసర్లు లంచగొండితనానికి శిక్షించ బడ్డారు. [కంచే చేను మేస్తే ....] ఒక్క న్యూయార్కు నగరములో 25,000 మంది ఈ అలవాటున్న వారు ఉన్నారు. 1971 లో ఈ సంఖ్య 1000000 కు పోతుందని అంచనా?

**వెల వివరాలు**

ఒక కిలోగ్రాము విలువ టర్కీలో 350డాలర్లు, ఫ్రాన్సులో [పరిశుభ్రపరచబడిన తరువాత] దీని విలువ 3500 డాలర్లు. న్యూయార్కులో దిగుమతి అయిన తరువాత ఏజెంటు దగ్గర విలువ 18000 డాలర్లు. ఏజెంట్ దగ్గర నుంచి యీ నల్లమందు బ్రాంచి ఆఫీసులకు వెళ్తుంది: [ప్రతి నాలుగు వీధులకు ఒక బ్రాంచి ఆఫీసు ఉంటుంది.] యిక్కడ దీనికి ఒక అవున్సు భాగాలుగా చేస్తారు. యిక్కడే దీనిని 75 పక్కెర, క్వినైన్‌తో కల్తీ చేస్తారు. ఒక అవున్సు ఖరీదు 500 డాలర్లు. దీనిని కొన్నవాడు మరల కల్తీచేసి [5 శాతంకో] 5 డాలర్ల పొట్లాలుగా అమ్ముతాడు. కొంతమంది వీనిని మరల 2 డాలర్ల పొట్లాలు చేసి అమ్మి లాభం చేసుకొంటారు. యీ వచ్చిన లాభంతో మందును కొనుక్కొంటారు. యీవిధంగా మొత్తం టర్కీలో 350 డాలర్లు చేసిన కిలో విలువ [అమెరికా వీధుల్లో] 225,000 డాలర్లు [మీకు తోచకపోతే రూపాయలలో విలువ కట్టుకోండి.]

**అలవాటులేని దశలు :**

మరిహొయినా సిగరెట్లు:— యిది ప్రథమ దశ. ఈ సిగరెట్లు ఆకారంలో మామూలు సిగరెట్ల మాదిరే ఉంటాయి. దీనిని బాగా అలవాటయిన వారు రోజుకు 3,4 మార్లు తాగుతారు. ఈ తాగడం అలవాటు కాదని చాలమంది అంటారు కాని యిది అలవాటయ్యే వ్యసనమని నా అభిప్రాయం.

హెరాయిన్:— యీ మధ్య ఒక హిప్పీ హెరాయిన్ అలవాటును సిప్పునూడి కెక్కి దిగకుండా నానా తిప్పలు పెట్టి కోలిగా వర్ణించాడు. యిది అలవాటయ్యే మందు. యీ పొడిని కొంతమంది ముక్కుతో పీలుస్తారు. కొంతమంది చర్మాంతర్గత యింజెక్షన్‌గా తీసుకొంటారు. కాని అతి ప్రమాదకరమైన అలవాటు నరాలలోనికి తీసుకోవడమే.




**యీ అలవాటు లక్షణాలు:—**

సాధారణంగా యీ అలవాటు ఉన్నవారు బట్టబయలు పడకుండా చాలా తెలివిగా వ్యవహరిస్తారు. కాని బాగా పరిశీలిస్తే యీ క్రింది లక్షణాలు కనిపిస్తాయి.

చదువుమీద, ఆటల మీద ఆసక్తి పోతుంది. ఒంటరి తనం ఎక్కువగా ఆశిస్తారు. ఆకలి నశిస్తుంది. వీరి కంటిపాప చాల చిన్నది అయిపోతుంది. యీ విషయం యిక్కడ వైద్యులకు చాలా ముఖ్యమైన విషయం. స్పృహతప్పి పడిపోయారని చాలమంది కుర్రవాళ్లను హాస్పిటల్‌కు తీసుకరావడం యిక్కడ కద్దు. అలా వచ్చిన వాళ్లను. పరీక్ష చేసేటప్పుడు నేను ముందు గమనించే విషయాలు:— కంటిపాప, మోచేతి దగ్గర యింజెక్షన్ గుర్తుల కోసం చూడడం. యిక్కడ దాదాపు 40% బాలురు, నవయువకులకు యిలాంటి గుర్తులు ఉంటాయి.

**మందు దొరక్కపోతే**

అప్పుడప్పుడు యీ మందు లభించదు. కాని యిది నరుకులేక పోవడము గాదు. పిల్లల దగ్గర డబ్బులు లేకపోవుట. అప్పుడు లక్షణాలు యిలా ఉంటాయి:—

విపరీతంగా చెమట పోయుటం, తీవ్రమైన ఆందోళన చెందుట, ఆవలించడము, వాంతులు.

**యీ అలవాటుకు మందు లేదా**

అలవాటుకు అలవాటే మందు అనే సిద్ధాంతమే యీ వ్యాధికి నివారణ. మెథడోన్ అను పదార్థమును వీరికి యిస్తూ, నెమ్మదిగా హెరాయిన్ అలవాటును వదలిస్తారు. మెథడోన్ కూడా అలవాటయ్యే పదార్థము. కాని హెరాయిన్ అలవాటుకన్నా ఈ అలవాటు ఎన్నోరెట్లు మెరుగు. దీని ఖరీదు 15 సెంట్లు. [రోజు మొత్తానికయ్యే ఖర్చు]. హెరాయిన్‌కు రోజు మొత్తానికి అయ్యే ఖర్చు 50 డాలర్లు. అంత డబ్బు లేకపోవుటవలనే చాలమంది తమ అలవాటును గడుపుకోవడానికి దొంగతనము, వ్యభిచారము, హత్యలకు సైతం పాలుపడుతారు.

కొంతమంది మానసిక శాస్త్రవేత్తలు ఈ మందు అలవాటు పోగొట్టుట వాల కష్టతరమనిఅంటారు. కాని వారు యీ అలవాటు తమ ఆరోగ్యమునకు, మనస్సునకు చాలా హానికరమని యీ అలవాటు బాధితులు అనుకొనేట్లు చేస్తే కొంత ప్రయోజన ముండునని భావిస్తారు. ప్రస్తుతము అమెరికాలో యీ అలవాటు బాధితులకు ప్రత్యేకముగా భవనములు నిర్మింపబడినవి. ప్రతిరోజు వీరికి యీ భవనములలో మెథడోన్ ట్రీట్‌మెంట్ యివ్వబడుతుంది. మరియు యీ అలవాటువలన కలుగు హానిని గురించి సినిమాలు చూపించబడుతాయి.

**తాజావార్త:—**

యీ మధ్య ఒక 12 ఏళ్ల బాలుడు యీ మందు ఎక్కువ తీసుకోవడం వలన మరణించాడు.

(64 వ పేజీ చూడండి)




జనవరి ఒకటవ తారీఖు ఉదయాన్నే లేచి బజారుకు వెళ్ళ సత్యానికి ఒక పెద్దసమస్య ఎదురైంది. తన భార్య సరోజ పుట్టిన రోజు సందర్భంగా ఒక్క ఇరవై, ఇరవై ఐదు పైసలకి పువ్వులు కొనడ మెలాగా అని. మామూలురోజుల్లో ఐతే ప్రొద్దుటే పువ్వులు కొనాలన్నా, అదీ పది పదిహేను పైసలకే అయినా పెద్ద కష్టమైన విషయమేం కాదు. కాని ఈ రోజు, అంటే జనవరి ఒకటవ తారీఖున మాత్రం కాసిని పువ్వులు కొనగలగాలంటే చాలా కష్ట సాధ్యం లాగే ఉంది. జనవరి ఫస్ట్ వచ్చిందంటే పట్టణంలోని పూలవర్తకులందరికీ చాలా హుషారుగా ఉంటుంది. మామూలు రోజుల్లో పెళ్ళాం, పిల్లలకి పూలు కొననివారు కూడ ఆరోజు పూలదండలు, బొకేలు కొని తమ తమ పై అధికార్ల దగ్గిరకీ, పురప్రముఖుల దగ్గిరకి బారులుతీరి వెడతారు. అందుకనే ఆ రోజు ఎవ్వరూకూడ విడిగా పూలమ్మరు. పెద్ద పెద్ద దండలు, చిన్న చిన్న దండలు, చమ్కీదండలు కట్టి రోజు కంటె హెచ్చుధరకే అమ్ముతారు. సామాన్య మానవుడు, మామూలు గుమాస్తా ఐన సత్యానికి, తన దగ్గరున్న కాసిని పైసాలతోను తన భార్య పుట్టిన రోజు సందర్భంగా పువ్వులు కొనడం గగనసమస్యే అయి కూచుంది.

అప్పటికే సత్యం, ఎక్కడేనా విడిపూలు దొరుకుతాయేమోనని, పెద్దబజారు, పూల వీధి, స్టేషన్‌దగ్గర చూసాడు. కాని అన్ని చోట్ల అతనికి నిరాశే ఎదురైంది. ఎన్ని కొట్లు తిరిగినా దండ అమ్ముతామనేవారే కాని, పూలమ్మేవాళ్ళే లేరు. తన జేబులో ఉన్న కొద్ది చిల్లరపైసలకి, అతిచిన్న దండ ఖరీదుకి వ్యత్యాసం రెండు రూపాయలపైనే ఉంది. భార్య పుట్టినరోజు సందర్భంగా కాసిని పూలైనా కొనలేని తన అశక్తతను మరోసారి నిందించుకున్నాడు. అయినా సరోజ మరీ జనవరి ఒకటవ తారీఖునే పుట్టాలా? జీతాలొచ్చిన ఏ రెండవ రోజునో తన పుట్టినరోజు వచ్చేలాగ, మూడవ తారీఖునో, నాల్గవ తారీఖునో పుడితే ఎంత బాగుండేది అనుకున్నాడు.

అయినా దీనికంతటికీ మూర్తిగాడే కారణం. నిన్న సాయంత్రందాకా తను అతి భద్రంగా దాచుకున్న నాలుగు రూపాయలు 'మనపై అధికార్లకి, పురప్రముఖులకీ, ఇతరులకు, నూతన సంవత్సర శుభాకాంక్షలతో బాటు చిన్నకానుక లేమైనా పట్టుకెళ్ళాలి; ఆఫీసులో అందరం కలిసి డబ్బులు పోగేస్తున్నాం, నువ్వుకూడా ఇయ్యి' అని గద్దలా తన్నుకుపోయేడు. అప్పటికీ తను ఒక్క రూపాయేనా ఉంచుకుందామని చూసాడు. మూర్తి వింటేనా! 'మన ఆఫీసరుగారిని చూడాలా, జిల్లా ముఖ్యాధికారి ఒకరా, చైర్మన్‌గారా, ఇంకా ముఖ్యులు ఇద్దరు

ముగ్గురుంటారా? వీరందరికీ, దండలు, బొకేలుకొని, పళ్ళు, బిస్కట్టు టిన్నో, స్వీట్సుటిన్నో పట్టుకెళ్ళడానికి నాలుగురూపాయలేం సరిపోతాయి?' అని పెట్టుపట్టి తీసుకున్నాడు మూర్తి, 'రంగారావులాంటి వాళ్ళకిది మంచి సదవకాశం. ఈరోజు ఉదయాన్నే ఆఫీసరింటికెళ్ళి, ఆయన్ని యథాశక్తి స్తుతించి (వీలైతే ఆయనతో ఒక ఫోటో దిగి), ఆయన మెప్పుకై ప్రాకులాడతారు. ఆ తరువాత పట్టణంలో ముఖ్యులందరినీ దర్శించి, ఈ అవకాశాన్ని వినియోగించుకొని వారి ప్రాపు సంపాదిస్తారు. ఆ నాలుగు రూపాయలుంటే, తను, సరోజ ప్రొద్దుటే కోవెల కెళ్ళేవారు. వీలుంటే సాయంత్రం ఏ సినిమాకో వెళ్ళేవారే. ఈ మూర్తిగాడివల్ల తన పథకం అంతా తారుమారయ్యింది. జీతాలు రేపుకాని రావు. ఈ రోజేం చెయ్యటం? పోనీ ఎవరైనా అప్పడుగుదామంటే అభిమానం అడ్డొస్తోంది. అయినా కొద్ది మాసాల క్రితమే జిల్లా ముఖ్యపట్టణానికి బదిలీ అయివచ్చిన తనకే అప్పిచ్చేంత సన్నిహితు లెవరుంటారు?

ఇల్లా ఆలోచించుకుంటూనే రిక్త హస్తాంతో ఇంటి ముఖంపట్టిన సత్యం దాదాపు ఆఫీసర్స్ కాలనీదాకా వచ్చేసాడు. ఆరోడ్డు, రోడ్డంతా తిరునాళ్ళ ప్రదేశంలాగుంది. కార్లలో వచ్చేవాళ్ళు, రిక్షాల్లో వచ్చేవాళ్ళు, సైకిళ్ళపై వచ్చేవారు, నడచి వచ్చేవారితో క్రిక్కిరిసి ఉంది. వచ్చేవారు వస్తున్నారు, పోయేవాళ్ళు పోతున్నారు. రోడ్డుకిరువైపులా నిన్నటిదాకా అక్కడ లేని పళ్ళ అంగళ్ళు పూల దుకాణాలు వెలిసాయి. ప్రతి అంగడి దగ్గరా వ్యాపారం జోరుగా సాగుతోంది. జత యాపిల్సు నాలుగు రూపాయలు, బత్తాయిలు డజను నాలుగు రూపాయలు. అన్నీ ఈరోజు తన కందుబాటులో లేని ధరలే అనుకుంటూ— జన సమూహాన్ని తప్పించుకుంటూ నడుస్తున్న సత్యానికి 'బాబూ దండ కావాలా' అన్న ప్రశ్న వినబడి పరికించి చూసాడు. ఎదురుగా చింపిరి గుడ్డలతో తలకి సంస్కారంలేక, బుజాన్న పసివాడితో నిలబడ్డ స్త్రీమూర్తి 'ముప్పావలాకిస్తా తీసుకోండి' అంటోంది. అంత డబ్బు తనదగ్గరెక్కడిది? అక్కర్లేదన్నట్టు తల విదిలించి ఆమెని దాటిపోబోతోంటే, పోనీ అర్ధరూపాయకి తీసుకోండి అంది. చిన్నదండ, చేమంతులుమాత్రమే ఉన్నా, అంత తక్కువ ధర ఎల్లా చెబుతోందా అని సత్యం దండవైపు నిశితంగా చూసాడు. అది అక్కడక్కడ నలిగిఉంది. అంటే అది అప్పుడే ఎవ్వరి మెడనో ఓ క్షణం అలంకరించిందన్నమాట. బేరమాడితే ఇంకా తక్కువకివ్వవచ్చు. కాని ఎవరికో వేసిన దండ తన సరోజకి, అందునా పుట్టినరోజు తీసుకెళ్ళడానికి సత్యానికి మనస్కరించలేదు. అంతకన్న ఖాళీ చేతులతో తిరిగి వెళ్ళడమే మంచిదనుకొని వడివడిగా అడుగులేస్తోంటే 'పూలండీ పూలు, పంద రూపాయి' అన్న కేక వినిపించింది. ఇదేమిటీ ఆశ్చర్యం అనుకొని కేక వినబడినవేపు నడిచాడు. 'రండి బాబూ పూలు, చక్కని పూలు' అని ఒక ముసలాడు ఎంతగొంతు చించుకు అరు

# జనవరి ఫస్ట్

స్తున్నా ఎవ్వరూ అతని కొట్టు చాయలకే పోవడంలేదు. సత్యం సంతోషంగా అతని దగ్గిరకివెళ్ళి 'ఒక పాతిక పూరియ్యి తాతా' అన్నాడు.

పొట్లం తీసుకుంటూ 'అందరూ దండ లమ్ముతూంటే నువ్వు విడిపూలమ్ముతా వేం?' అని అడిగాడు.

'కష్టదినం బాబూ, రోజూ వ్యాపారం చూసుకునే నా మనవడు వారం రోజుల బట్టి మంచంమీంచి లేవట్లేదు. వాడుంటే దండలే అమ్మేవాడు కాని, నాకేమో వయసు మీదబడి, చూపానక దండకట్టడం సిలు గావట్లే.'

'మరైతే కొట్టెందుకు పెట్టావ్?'

'ఏం చేయను బాబూ, మాది కాంట్రాక్టు వ్యాపారం. తోటల్లోని పూలు పెడాకా, ఒకరోజు తీసుకొని, ఇంకోరోజు తీసికోకపోతే మాకే నష్టం. తీసుకున్నా, తీసుకోకపోయినా డబ్బిచ్చి తీరవలసిందే కదా!'

ఎన్ని కష్టాలు కలిగించినా—చివరకి తను లాంటి సామాన్య మానవులను భగవంతుడు ఒక కంట కనిపెట్టి చూస్తాడనుకుంటూ, ఆనందంగా ఇంటిదోవపట్టాడు, మధ్యతరగతి కుటుంబీకుడు, సామాన్య గుమాస్తా అయిన సత్యం.

* * *

పదేళ్ల సిద్ధిగాడికి ఆ రోజు చాలా అయోమయంగా ఉంది. వాడు చాల తిరునాళ్లు, తీర్థాలు సూసాడు కాని ఇంత అడావుడెక్కడా సూడలేదు. తిరునాళ్లలో రంగుల రాట్నాలుంటయి, తింటానికి దొరు కుడ్డి, రంగుల రంగుల బొమ్మల దుకాణాలు, ఇంకా ఊదే బూరాలు, తిరిగే బొమ్మలు ఎన్నో ఉంటయి. ఏ మరిడమ్మ పండగో ఐతే టెంకాయల దుకాణాలు, పూల దుకాణాలుంటయి. మహా ఐతే అరిటిపళ్లుం టయి. ఇదేమిటిక్కడ అయేయోరకాల పళ్లుండయి కాని టెంకాయల్లేవేం? అందరూ, దండలు, పళ్లు కొనుక్కుని, లోపల పెద్ద పెద్ద బంగళల్లో కెడుతుం డారు. అయి బంగళలని, లూయామే అదేదో పండాని అందరు పళ్లు, పూలట్టుకుని బంగళల్లో కెడతారని అమ్మ సెప్పింది. ఆ బంగళల్లో ఏ దేముళ్ళుంటారో. మరి ఆ దేముళ్ళకి టెంకాయ లిష్టముండదు కామోసు. లోన ఏం జరుగుతుందో సూడా లని సిద్ధిగాడికి, ఆడి సెల్లెలికి చాల కుతూ హలంగా ఉంది. కాని ఆ కార్లు, ఖరీదైన గుడ్డలేసుకున్న మనుషులు సూస్తే ఆడికి గుబులెత్తింది. దానికితోడు ఆ బంగళాల దగ్గిరే చాలమంది పోలీసులు ఖాకీ గుడ్డల మనుషులు తిరుగుతున్నారు. ఎందుకేనా మంచిదని, సిద్ధిగాడు, లచ్చి అళ్ళకి దూరం గానే అడుక్కుంటున్నారు.

అమ్మ, తను, సెల్లెలు, ఇంక కొత్త తమ్ముడు, అసలు పెద్ద బజార్లో బడీల కింద తొంగుంటరు. ఈ రోజు అమ్మ తన్ని, సెల్లెల్ని తొరగా నెగ్గొట్టి ఇంక తెల్లారకుండానే ఈడకి తీసుకొచ్చింది. వస్తూండగా సెప్పింది. ఇదేదో పండగ కనుక పెద్ద బంగళాకాడ సాన కొత్తుడ తారని. కాని తనకి వరదాతేసే కొత్తేం లేవు. పైగా లోనేం జరుగుతుందో సూటానికీల్లేదు. మరిడమ్మ పండగప్పుడు, ఇంకా గంగానమ్మ తీర్థమప్పుడు తను, లచ్చి సక్కగా లోపల కెళ్లొచ్చు. ఏం జరుగు తుందో సూసి, అమ్మవారి గుళ్లోనే టెంకాయ సిప్ప అడుక్కోవచ్చు. కాని ఇయ్యేల అమ్మ మరీ మరీ సెప్పింది, పైసా అడుక్కోవద్దని. బంగళల్లోంచి తిరిగొచ్చే బాబులని 'బాబూ ఒక్క పండు ముక్క పెట్టండి, ఒక్క బిస్కట్టు ముక్క పెట్టండి ఆకలేస్తోందని' అడగాలని. తను లచ్చి అట్టాగే సేస్తుండారు. ఇప్పటికి తిన్నంత తినగా నిక్కరు జేబులనిండా చాల పళ్ళ ముక్కలు, బిస్కట్టు ముక్కలు ఉన్నాయి. అమ్మ కూడ రోజూలాగ 'సంటి బిడ్డలకి ఒక్క పైసా ఇప్పించండి' అని అడుక్కోకుండా, బంగళాల్లోంచి తిరిగొచ్చే బాబుల్ని 'ఆ దండ ఇలా పడెయ్యండి బాబు' అని అడుక్కుంటోంది. ఛీ! దండ లెందుకు? తినాలా ఏమైనానా? రోజూలాగ పైస అడుక్కోకూడదా? లేకపోతే తనలాగ పళ్ళు, బిస్కట్టు అడుక్కోకూడదా? అను కున్నాడు. కాని అమ్మ కెవ్వరేనా దండలిస్తే, తిరిగి ఇంకెవ్వరికేనా అమ్మడమో లేక పూల సాయిబు కొట్లో ఇచ్చేసి పావల తీసు కోడమో సేస్తుంటే సిద్ధిగాడికి ఆశ్చర్య మైంది.

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!




పిల్లల శక్తి చదువుల్లో ఆటల్లో త్వరగా హరింపు అయిపోతుంది. శక్తిని తిరిగి సమకూర్చటానికి ప్రతి దినం వారికి బోర్న్‌విటా ఇవ్వటం మంచిది. క్యాడ్‌బరిస్ తయారుచేసిన రుచికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారల సంతులిత మిశ్రమం-బోర్న్‌విటా.




**శక్తి, ఉత్సాహం మరియు**
**రుచికోసం క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా।**

# జనవరి ఫస్ట్

ప్రొద్దున్నుంచి అంత అడావుడిగా ఉన్న రోడ్డు మీద రాను రాను పొద్దు బారెడెక్కాకా అడావుడి తగ్గడం మొదలెట్టింది. ఇంతలోకే 'తప్పుకోండి, తప్పుకోండి' అన్న కేకలు, వెనకాలే వరుసగా బోల్డన్ని కార్లు యెళ్లిపోవడంతో, జనం ఎక్కడెక్కడే సద్దు మణిగిపోయారు. ఆ తరువాత నెమ్మదిగా కొట్లెత్తెయ్యడం మొదలెట్టారు. ఇంకా అడుక్కుందామంటే బంగళల్లోంచి బయటికొచ్చే మనుషు లెవ్వరూ కనబడకపోవడంతో అమ్మ గురించి సుట్టూతా సూసేడు. అమ్మ సాయిబుకి కొట్టెత్తేయడంలో సాయం సేస్తోంది.

'అమ్మో, కొట్టెందుకెత్తేస్తుండారే? అప్పుడే తిరునాళ్లయిపోయిందేటి? మరైతే ప్రభ బయటికి తీసుకురారేం?' అన్న సిద్ధిగాడి ప్రశ్నకి సాయిబు బడబడా నవ్వి 'ఒరేయి ఇది తిరునాళ్ళకాదూ. ఈరోజు జనవరి ఫస్టు. పొద్దుటే లేచి జనాలందరూ పెద్దదొరల ఇంటికివెళ్లి, దండలు వేసి, పళ్లిచ్చి నమస్కరించొస్తారు. లోపల బంగళల్లో కలెక్టరు దొరగారు, చేర్మను బాబుగారు, పెద్ద పోలీసుదొర, ఇంజనీరు దొర, టేక్సు ఆఫీసుదొర, ఫారెస్టుదొర, ఇంకా పెద్ద పెద్ద దొరలెందరో ఉంటారు, అంతేకాని దేములు కాదు. ఇప్పుడు కార్లలో ఆళ్లందరూ ఎళ్లిపోయారుగా, అందుకని బంగళల్లోకి ఎవ్వరూ వెళ్లరు. అంటే ఇక్కడ మన యాపారం అయిపోయినట్టే' అన్నాడు. పూరితట్ట, అమ్మ నెత్తికెత్తుతూ. సిద్ధిగాడికేం ఎరికపోలే. 'ఇది తిరనాళ్ల కాపోతే మరేంటో, మరీ సరదాగా వేకపోయినా తిండి బాగానే దొరికింది, కదా! ఇదీ బాగావే ఉంది. మళ్లీ ఈ పండగ ఎన్నాళ్ళ కొస్తుందో!' అనుకుంటూ అమ్మ యెనకాలే నడిసాడు, సిద్ధిగాడు, సెల్లిని సేయట్టుకొని.

* * *

శీనప్ప చిన్న కంట్రాక్టరు. పెద్ద దొరలకి కానుక లివ్వటం లాంటిది తన కలవాటులేదు. ఐనా ఈమధ్య కంట్రాక్టర్ల అసోషియేషన్ అంటూ ఒకటొచ్చిపడ్డాకా, అదని ఇదని అసోషియేషన్ వాళ్ళు డబ్బు వసూలు చేస్తూనే ఉన్నారు. ఈ జనవరి ఫస్టు సందర్భంగా చిన్న, పెద్ద కంట్రాక్టర్లందరూ ఒక్కొక్కళ్లు యాభై రూపాయలేసుకుని, దండలు, పళ్ళుకొని, రెండు టాక్సీలలో ముందు తమ డిపార్టుమెంటు ఆఫీసరుదగ్గరకి, ఆ తరువాత జిల్లా ముఖ్య అధికార్లదగ్గరకి, శుభాకాంక్షలు తెలియచేయడానికి తిరిగారు. తనకి ఇటు వంటివేం ఇష్టంలేదు. ఐనా తనొక్కడు వెళ్లకపోతే, ఏం బాగుండదోనని, పైగా అసోషియేషన్ సెక్రటరీ రాజుగారికి కోపం వచ్చిందంటే మళ్లీ పాటలప్పుడు ఒక్క పాట దక్కనియ్యడని, లోపల చికాగ్గా ఉన్నా పైకి మాత్రం నవ్వుతూ తిరిగేడు. తన ఊరినుంచి పని మానుకొచ్చినందుకు ఒక పాలికె దండగ, అదికాక ఆఫీసు జమాను కాఫీకని, అదని ఇదని మొత్తం మీద ఒక పచ్చనోటు ఖర్చయ్యింది. తనకేమో వ్యాపారంలో మరీ అన్యాయంగా లాభాలు గడించ బుద్ధికాదు. ఖర్చులుపోను తనకి కొంచెం మిగిలితే చాలనే తన తాపత్రయం. మరి ఇల్లాటి ఖర్చులు మీద పడితే ఎల్లా తట్టుకోడం? లాభంలేదు. ఈసారి సరుకు మార్కెట్టుకి తోలేటప్పుడు ఖర్చులలో ఇది కూడ కలుపుకోవాల్సిందే అనుకొన్నాడు శీనప్ప. 'అంటే నువ్వు, నీ దగ్గిర సరుకు కొని అమ్మే వ్యాపారులు (మరి వారుకూడ శుభాకాంక్షలు తెలుపుకోవాలిగా!) వీధిలోని సామాన్య మానవుడి నెత్తిన ఈ ఖర్చంతా రుద్దుతారన్నమాట!' అంది శీనప్ప అంతరాత్మ.

* * *

ఆ సాయంత్రం, సినిమా కెళ్ళలేక పార్కు దగ్గిర కెళ్లిన సత్యానికి దూరంగా లౌడ్‌స్పీకర్లలోంచి ఎవరిదో ఉపన్యాసం వినబడుతోంది. 'ఈ నూతన సంవత్సరం సందర్భంగా మనమంతా ప్రజల సేవకులమని, ప్రజలకోసమే మనమున్నామని, మన దేశం ప్రజాస్వామ్యమని గుర్తించుకోవాలి. ఈ నూతన సంవత్సరం మొదటి రోజున మనమందరం సామాన్య మానవుడికి మేలు చేకూర్చడానికి మరింతగా కృషి చేస్తామని, బీద ప్రజానీకం పరిస్థితి మెరుగుపర్చటానికి మరింతగా కృషి చేస్తామని మరొక్కసారి దీక్ష వహించాలి' అంటూ. ●

# ఒక వారం విపరీతం
## పాఠకుడు

### ప్రమాదంలో బ్రతికిన గర్భస్థ శిశువు

ఇల్లినాయిస్‌కు చెందిన క్విన్సీలో ఓ కారు ప్రమాదంలో ఆ కారులోని గర్భిణీ స్త్రీ గర్భం పగిలి గర్భస్థ శిశువు బయట పడిందట. ఆతల్లి అక్కడికక్కడే చనిపోయిందట. ఎనిమిన్నర నెలల వయస్సున్న ఆ ఆడపిల్ల మాత్రం క్షేమంగా వుందిట. ఆమె తల్లి భర్త, ముగ్గురు సవతి కొడుకులూ అదే ప్రమాదంలో చిక్కుకున్నా వారికి మాత్రం పెద్దగా దెబ్బలు తగల్లేదట.

### ప్రేమికుల ఆత్మహత్య

బెంగుళూరు కాలాసిపాల్యానికి చెందిన 45 ఏళ్ళ ఎల్లప్ప అనే వివాహితుడు సుల్తాన్‌పేట లోని ఓ హొటల్లో రూము తీసుకున్నాడట. 23వ తేదీ వుదయం లక్ష్మి అనే 32 ఏళ్ళ అమ్మాయి ఆయన రూముకువచ్చి, కాస్సేపుండి బయటికి వచ్చి, పెద్దవాంతి చేసుకుని పడి చనిపోయిందట. ఎల్లప్ప రూములోపలికు తాళంవేసి వుండటంవల్ల పోలీసులు తలుపులు పగలకొట్టి చూస్తే లోపల ఎల్లప్పకూడా చనిపోయి వున్నాడట. పకపోనున్న సీసాల్లోని బ్రాందీలో విషం కలిపి వున్నదట. వీరిద్దరూ ప్రేమికులని తెలియ వచ్చిందట. బహుశా ఆత్మహత్య చేసుకునుండి వుంటారని పోలీసునమ్ముతోంది.

### స్వాతంత్ర సమరంలో 3 లక్షలమంది ఆహుతి

తూర్పుపాకిస్తాన్ స్వాతంత్ర్య సమరంలో సుమారు 3 లక్షలమంది ఆహుతి అయ్యుంటారని, ఆ ప్రాంతాలు, ఇళ్ళు వాకిళ్ళూ వదలి సరిహద్దులుదాటి మన దేశానికి పారిపోయివచ్చిన వారిసంఖ్య కొన్ని వేలుంటుందనీ పేపర్లంటున్నాయి.






### పొత్తుకుదరని భార్య

ధనం అనే 16 ఏళ్ళ అమ్మాయికి తన భర్తతో పొత్తు కుదరక, భర్తను వదలి, కాట్పాడిలో వున్న తన అన్నగారింటికి వెళ్ళిందట. కానీ, అన్నగారు ఆమెను వారించి, తిరిగి భర్తవద్దకు వెళ్ళిపొమ్మని చెప్పేసరికి, తన మనస్సు అంగీకరించని పని చేయ డానికి యిష్టపడక, కాఫీలో విషం కలుపుకు త్రాగి, చనిపోయిందట.

### మేడమీదనుంచిపడి మరణించిన యువతి

వేలూరు ఆసుపత్రిలో రెండవ సంవత్సరం నర్సు కోర్సు తరిఫీదవుతున్న 18 ఏళ్ళ శోభన అనే ఆమె మేడ ఏడవ అంతస్తుమీద తను ఆరేసుకున్న చీర విప్పదీయ బోతుండగా కాలుజారి అంతఎత్తునుంచి క్రింద పడిందట. నూరుఅడుగులఎత్తునుంచి పడడంతో ఆమె కాళ్ళు విరిగి పోయాయట. తల పగిలి మెదడు బయటకి వచ్చిందట. రక్తపుమడుగులో విలవిలా తన్నుకుని అక్కడే చనిపోయిందట. ఇది 26 వ తేదీన జరిగింది.

* * *

తాయార్‌కుప్పమ్ అనేవూర్లో పోయిన ఎన్నికలలో ద్రవిడమున్నేట్ర కజగం పార్టీతరపున ప్రచారం చేసిన 40 ఏళ్ళ కరుత్త కణ్ణన్ అనే అతను 29వ తేదీ వుదయం తన ఇంట్లో భోజనం చేస్తుండగా కత్తులతోనూ కటారులతోనూ ఓ గుంపుజనం వచ్చి అతనిమీద పడ్డారట. దాంతో కరుత్తకణ్ణన్ పెరటిదోవన పారిపోయేసరికి వారాతన్ని వెంబడించి, పట్టుకుని చంపేశారట. రామస్వామి అనే 20 ఏళ్ళ [డి యం కె] వ్యక్తిని కూడా అలాగే చంపేశారట. ఈ చంపిన వారు సిండికేటు కాంగ్రెసు పార్టీవారని తెలిసిందట —దటీస్ పొలిటికల్ థర్స్ట్!

### పిచ్చివాడి పాపం

ధర్మపురికి చెందిన పళర్‌కళ్ళు అనే గ్రామంలో మతిస్థిమితం కోల్పోయిన పెరియ కరుప్పగవుండర్ అనే ఆయన క్రోధం వచ్చి, తన 4 ఏళ్ళకూతుర్ని కొడవలితో చిన్న చిన్న ముక్కలుగా తరిగి, నూతిలో పారేశాడట. కోర్టు యీాయన్ని విచారించి, పాపం పిచ్చివాడు అన్నదట.

### ఆత్మహత్య చేసుకోడానికి తలకి కన్నాలు పొడుచుకున్న వ్యక్తి

ఆత్మహత్య చేసుకోదలచిన ఒకాయన మిషనుతో తన తల మీద ఎనిమిది బొక్కలు పొడుచుకున్నాడట. ఈ విషయం మీద మైకేల్ స్పైమన్ అనే ఓ పాథాలజిస్టు మాట్లాడుతూ, బుర్రమీద బొక్కపొడుచుకోడంతోనే మనిషి చనిపోడని, తలలో మేకులు కొట్టుకున్నపుడంతాలు కూడా వున్నాయని అన్నారట. తలలో ఎనిమిది కన్నాలు పొడుచుకున్న 57 ఏళ్ళ విలియమ్‌హాల్ ఆనక చనిపోయారుట. ఇది విదేశవింత!!

### కడుపునొప్పి భరించలేక ఆత్మహత్య

కడుపునొప్పి బాధను భరించలేక, దాన్ని జయించలేక, ఆవస్థపడలేక, వేరే గత్యంతరంలేక ఆరూర్ ప్రభుత్వ ఆఫీసులో ప్యూనుపని చేస్తున్న షన్ముయ్య నాయకర్ తనింట్లో వురిపోసుకుని నిండు ప్రాణాలను తీసుకున్నాడట.

### చెత్తబహుమతుల విలువ 7 లక్షల రూపాయలు

70 ఏళ్ళ హైక్సొకొనిషి అనేఆయన, ఆయన భార్య ప్రతిరాత్రీ ఒంటిగంటకు లేచి తమ పరిసర ప్రాంతం ఇళ్ళవారు బయటపారేసిన చెత్తను పరిశీలించి, వాటిలో పని కొస్తాయనుకున్నావన్నీ ఏరి, యమగట నగర కార్పొరేషను అధికారులకు తమ పేరిట కానుకలుగా యిస్తూ వచ్చారట. ఇప్పటికి గత కొన్నేంళ్ళుగా వారి సర్దులో 35 దఫాలు యిచ్చిన వస్తువుల విలువ ఏడులక్షల రూపాయలట వారిస్తే తేటతీరంటే ఏమిట?— ఇది జపాన్ వింత.

ఒంటి గంటయింది!! పద!
మనమూ ఆపని చేద్దాం!!
ఏడు లక్షలు!! ఏడు లక్షలు!!!



రంగుల రాట్నం

కామేశ్వరరావు



# వైరస్

ఇది జంతుజాతా, వృక్షజాతా అంటే చెప్ప లేము! అసలు జీవా, నిర్జీవా? అనేదానికే సమాధానం చెప్పలేము. లీవెన్‌హాక్ 17 శతాబ్దంలో సూక్ష్మదర్శిని కనిపెట్టాక శాస్త్రజ్ఞులు అనేక సూక్ష్మజీవులను చూడ్డం ప్రారంభించారు. రోగాలకు కారకులైన క్రిములను తెలుసుకున్నారు. 'అతిసూక్ష్మజీవులు' అని బాక్టీరియాని అన్నారు. అవే అతిసూక్ష్మజీవులని అనుకొన్నారు. కాని 1892 ఇవనోవెస్కి పరిశోధన ఫలితం దీన్ని తారుమారు చేసింది. బాక్టీరియాకన్నా సూక్ష్మజీవులున్నాయన్నాడు. అవి పోర్సిలైన్ వడబోతద్వారా దూరి పోతాయని, అంత సూక్ష్మమైనవని గ్రహించాడు. వీటికి 'వైరస్' అని పేరు పెట్టాడు. (అంటే విషం అని అర్థం.) క్రమంగా ఒకటి, ఒకటి జబ్బులు వైరస్‌వల్ల సంభవిస్తాయని తెలిసింది. ఎల్లోఫీవర్, మశూచి పోలియో, తట్టు, ఇన్‌ఫ్లూఎంజా, గవదబిళ్ళలు—అన్నీ వేర్వేరు రకాల వైరస్‌వల్ల సంభవిస్తాయని ప్రపంచం తెలుసుకొంది. వీటి కొలతలు మిల్లి మైక్రానులలో చేస్తారు. (1 మిల్లీమీటరుకు 1000 మైక్రానులు. 1 మైక్రానుకు 1000 మిల్లీ మైక్రానులు.) బాక్టీరియా 5, 6, మైక్రానులుంటాయి. వైరస్ 10 నుండి సుమారు 300 మిల్లిమైక్రానులుంటాయి. పోలియో వైరస్ 25 మిల్లిమైక్రానులు ఎస్. టి. వైరస్ 250 మి. మై. ఎర్రరక్తకణం పోల్చండి. 7500 మి. మై. ఉంటుంది. ఒక్కొక్క బాక్టీరియాలో 10 లక్షలు వైరస్‌లు ఉండవచ్చు. సూక్ష్మమైన బాక్టీరియాకి అతి సూక్ష్మమైన వైరస్‌కి అదీ పోలిక.

జీవులకు, వైరస్‌కు పోలిక ఉంది. అంటే, సంతానోత్పత్తి విషయంలో స్పష్టంగా కనబడుతుంది. కాని వైరస్ మామూలుగా ఉన్నప్పుడు, స్ఫటికాలు మాదిరిగానే కనబడుతుంది. గుండ్రంగానో, కోలగానో, కణికలుగానో, చిరుకప్ప ఆకారంలోనో ఉంటాయి.—75° సె. అంటే మంచుఏర్పడే ఉష్ణోగ్రతకన్నా 75° సె. లోపున ఉన్నాకూడా ఇవి తమశక్తిని కోల్పోవు. అయితే తమ శక్తిని చూపాలంటే అవి ఇతరజీవుల్లో ప్రవేశించాలి. అప్పుడే వాటి ప్రభావం కనబడుతుంది.

1935లో వెన్‌డల్ స్టాన్లీ పొగాకులోని మొజాయిక్ జబ్బుకు కారకమైన వైరస్‌ను స్ఫటికీకరణ చేశాడు. ఇది మామూలుగా ఉండే ఉప్పు— చక్కెర మాదిరిగానే ఉంటుంది. అంటే నిర్జీవ పదార్థంగానే ఉంటుంది. పొగాకుచెట్టులో ప్రవేశపెడితే దాని పునరుత్పత్తి ప్రారంభం అవుతుంది. దీన్నిబట్టి ఇది జీవ నిర్జీవ పదార్థాలకు మధ్యస్థంగా ఉందని చాలామంది అభిప్రాయం. (తెలతెలవారుతున్నప్పుడు ఇది రాత్రా పగలా అంటే ఎలా చెప్పలేమో ఈ వైరస్ స్థితికూడా అంతే.) మనిషి 'జీవి' అని వేటిని అంటాడో, వాటిలో చాలా లక్షణాలు దీనికి లేవు. ఇవికూడా జీవులే అంటే మన సూత్రీకరణం మార్చుకోవాలేమో, వైరస్‌లను ఇతర జీవుల శరీరం నుంచి వేరుగా పెంచడం అసాధ్యంగా ఉంది.

వైరస్‌లు బాక్టీరియాకు జబ్బు తెప్పిస్తాయి. అందుకని వాటిని బాక్టీరియోఫేజ అని— పొట్టిగా (ఫేజని) అని అంటారు తేలికగా పలకాలి.

మానవుల్లో కలిగే మీసిల్సు (తట్టు) అనేది శ్వాసకోశానికి సంబంధించిన జబ్బే అయినా చర్మం మీద గుర్తుగా ఎర్రటి తట్టు ఏర్పడుతుంది. దీనికి తగిన రక్షణ సీరము ఇప్పటి వరకు ప్రయోగాల్లో తయారు చెయ్యలేకపోయారు. తట్టువల్ల ఇతర క్లిష్ట పరిస్థితులు ఏర్పడడానికి అవ

(64 వ పేజీ చూడండి)

# ఒకవారం విపరీతం

## మిరియం - ఆరోగ్యం

చూడండి. సీవీ. ఈ వయస్సులో నేనెంత బరువుగ్గా వున్నానో!! కట్టెలు కొట్టగలను. నా పను లన్నీ నేనే చేసుకోగలను, నా ఆరోగ్య రహస్యమంతా మిరియం లోనే వుందిస్మీ అన్నాడట 110 ఏళ్ళ జార్జిరిబ్స్ అనే ఆయన. ఆయన అవివాహితుడట దట్సిట్.

## జర్మన్‌లో జనం కొరత

ప్లీజ్! తొందరగా పెళ్ళిచేసుకోండి. కడుపుడు పిల్లల్ని కని దేశానికి జనాభా భిక్ష పెట్టండి అని పశ్చిమ జర్మనీదేశం తమ ప్రజలను, యువతరాన్ని అర్థిస్తోందట. ఎక్కువ పిల్లలను కన్న వారికి కొన్నిపన్నుల్ని రద్దుకూడా చేస్తోందట. అక్కడ వ్యాపార సంస్థ




లకు, కర్మాగారాలకు, దేశపురోభివృద్ధికి కావలసినంత మంది జనంలేరట. ఇప్పటికి అక్కడ 20 లక్షల మంది విదేశీయులు పని చేస్తున్నారట. దేశ సౌభాగ్యానికి జనాభాయే కారణమని వారు అభిప్రాయపడుతూ జనాభా లేనందుకు విచారిస్తున్నారట.... హావ్ టు బిలీవ్!! నిజమా!

* * *

సంస్థా కాంగ్రెస్‌కి చెందిన శ్రీమతి తారకేశ్వరీసిన్హా ఈనెల 4 వ తేదీ తెల్లవారుజామున నిద్రమాత్రలు ఎక్కువగా తీసుకున్న కారణంగా స్పృహలేని స్థితిలో ఢిల్లీలోని ఒక ఆస్పత్రిలో చేర్చబడ్డారట.




**ఎస్. వి. ఆర్. గుంటూరు**

నేను కొన్ని జోక్సు సంపాదించుకుంటు న్నాను. ఎక్కడికి పంపను?

ముందు వాటిని స్నేహితులకి వినిపించి చూడండి. నవ్వితే (వివరణ)లేకుండా నవ్వేశారా. లేకుంటే కొంచం ఆలోచించండి!

**ఎ. ఎస్, కొడుమూరు**

...కొంతమంది సినిమా కవులు అతి నీచమైన భాషలో ఒకరిపై ఒకరు విసురు కొను విసుర్లు చదివిన తరువాత...

బాగుంది. కవులు మాత్రం మనుషులు కారా? వారికి ఉడుకుమోతుతనం రాదా? వారేదో కవులు అందంగా తిట్టుకుంటారని భ్రమపడ్డాం మన పొరపాటేమో అనిపించింది నాకు! నాకర్థం కానిది ఒక్కటే— మొదట తిట్టినవాడు పెద్ద మనిషి. బదులు చెప్పినవాడిదే తప్పు అని గీపెడుతున్న భజన సంఘాల సభ్యుల గోల!

**కె. వి. ఎస్, కాకినాడ**

ధన మూలం మిదం జగత్. అంతేనా?

కాదు. సేవ అనే బంగారంతోగాని కొనలేని వస్తువులు ఉన్నాయి. వాటికోసం కృషి చేయాలి, ఓర్పు, ప్రేమ, త్యాగం లాంటివి ధారపోయాలి. అంతేగాని కాగితం డబ్బులతో కొనలేం వాటిని.

**టి. ఎస్. కె, కలకత్తా**

ఎన్నిసార్లు హెచ్చరించినా కొందరు విని పించుకోరు ఎందుకు?

సాహిత్యం అంత హెచ్చరికలకంటే ముల్లులాంటి ఒక్క అనుభవం చాలని నమ్ముతున్నారేమో వారు.

**వై. ఎస్. ఆర్, బొంబాయి**

'ది రీజనబుల్' అంటూ అంతా అంటారు. వారి ఉద్దేశ్యం ఏమిటండీ?

ఏమీ లేదు రావుగారూ, అవతలివాడు ఏం చెప్పాలని మనం అనుకుంటున్నామో అదే రీజన్ అంటాం.అంతే.

**ఎమ్. కె. తిరుపతి**

కొందరు వయసులో పెద్దలే అయినా ఎంతో నిండుగా సోయిగా ఉంటారు. అటు వంటి దంపతులు ఈకాలంలో చాలా అరుదు కదండీ.

హృదయపూర్వకంగా ప్రేమించే వాళ్ళు ఎప్పుడూ నిత్య యవ్వనులే. కృష్ణశాస్త్రిని చూడండి!

**పి. ఎస్. ఆర్, మద్రాసు**

ప్రశాంతంగా ఏకాంతంగా గడపాలంటే ఈ ప్రపంచంలో చోటు లేదా?

ఉంటుంది. కాని అక్కడా మీరుంటారు కదా. చూడండి— చేయడానికి ఒక పని, మనస్సుకు శాంతి ఉంటేనే— ఏకాంతం ఒకవరం. లేకుంటే శిక్షే.

**ఎమ్. ఎ. వి, హిందూపురం**

మనిషికి మనస్సు ముఖ్యమా డబ్బు ముఖ్యమా?

డబ్బుంటే ఎంత నల్లటి మనస్సైనా తెల్లగానే కనిపిస్తుందట అందరికీ!

**పి. ఎస్. వి, తొండవాడ గ్రామం చంద్రగిరి**

మానవుడు జీవించి సాధించినది ఏమిటి?

జీవించుకు రావడం కూడా ఈరోజుల్లో ఘన కార్యమే కదటోయ్ సాధించటానికి!

**డి. వి, సామర్లకోట**

నేను ఏదైనా కథ చదివినప్పుడు అది సుఖాంతం అయితే నాకెందుకో తృప్తిగా ఉండదు. ఎందువల్లనంటారు?

కీప్ షోయ్! కనీసం కథకైనా సుఖాంతం కావడం భరించలేరన్న మాట. మీరెప్పుడైనా గుర్తించారో లేదో కొంతకాలం క్రితం ఏడుపు కథలకి ప్రజా, జనానికి కథంటే ఏడ్పించాల అన్నట్లుండేది! ఇప్పుడు కొంచెం మారారు.

**జగ, జేజీపూర్**

స్త్రీని అర్థం చేసుకోవడం చాలా కష్టం అంటారు. ఎందుకు? ఏ విధంగా?

ఏ విధంగానైనా అర్థం చేసుకోవడం కష్టమని అందరూ (అంటే మగవాళ్ళు) నమ్మకం నటిస్తారంతే!

**డి. ఎస్. ఆర్. రాకెట్ల**

ప్రేమించి పెళ్ళాడలేక పోతున్నారు నేడు చాలా మంది. ప్రేమించిన వారిది తప్పా?

ప్రేమించిన వారిది కాదు తమ్ముడూ—పెళ్ళాడ డానికి వెనుతీసే వారిదే తప్పు. ప్రేమించడం సులభమే. పెళ్ళాడ్డమే కదా కష్టం?

**డి. వి. ఎల్. ఎన్, ద్వారకా తిరుమల**

మనిషి మొదట నుంచి కష్టమంటే తెలియకుండా పెరిగి చాలా నష్టాలకు గురి అయ్యాడు. అదే మనిషి ఈరోజున కష్ట పడి జీవించాలంటే?

మహాసులభమండీ.. పడ్డ కష్టనష్టాలన్నీ అనుభవం సంపాదించి పెడ్తాయి. ముందు జీవితం సాగ డానికి అనుభవానికి మించిన పెన్నిధి లేదు కదా!

సమాజాన్ని మోసం చేస్తున్న ప్రతి ఒక్కడూ సుష్టుగా భోంచేస్తున్నాడం టాను. మరి మీరు ఏమంటారు?

క్షమించాలి. నేను ఒంటిపూటే భోంచేస్తాను!

**వి. కె. ఆర్, విశాఖ**

2. 11. 18. 1. 10 — 25. 1. 12. 1. 11. 19. 8. 13. 9. ఇది చెప్పగల్గితే మిమ్మల్ని మా అభిమాన నక్స లైట్ అంటాను. అభ్యంతరమా?

పేరులోనే రాజ్యమేలుతూ నక్సలైట్ అంటా రేమిటి? జాగ్రత్త సుమా.

**కె. బి. హెచ్. తొగరాం**

అక్కయ్యా! నీవు పాఠకులకు సూటిగా సమాధానమిచ్చేటట్లు బాపుగారి ప్రశ్నకు జవాబిస్తే ఏమంటారు?

అంత సూటిగా సమాధానం యివ్వగల ప్రశ్నలే ఎప్పుడూ అడగలేదోయ్ ఆయన!? అయినా నంగిరి సమాధానాలు వారూ భరించలేరు అని నా ఊహ.

**ఎన్. ఎస్. ఎ. ఎస్, సిర్పూరు కాగజ్ నగరు**

రామలక్ష్మిగారూ మారుతున్న సమాజంలో నవల గూర్చి ముచ్చటించారు రేడియోలో. సంఘంలో స్త్రీని మగవాడు నీచంగా చూస్తున్నట్లు నీచంగా ఎత్తి చూపారు. మగవాడంటే మీ అభిప్రాయం?

నా ప్రసంగం తప్పుగా అర్థమైంది మీకు. ఆడదాన్ని నీచంగా చూస్తున్నది ఒక్క మగవాడే నని నేను అనుకుంటే ఆ ప్రసంగం వేరే ధోరణిలో సాగేది! శ్రీ వెంకటరమణ రాసిన మొగలిపొదలు వంటి నవలలని పేర్కొనకుండా వూరుకునేదాన్ని కదా!—'ఆడవారే ఎక్కువగా రాసేస్తున్నారన్న కాకి గోల తప్పు. జాగ్రత్తగా పరిశీలించి చూడండి' అని మాత్రమే చెప్పాను. అంతేకాదు. కల్పిత సాంఘిక సమస్యలకి ప్రాధాన్యం యిచ్చి, కల్పిత పరిష్కారాలు సహితం ధైర్యంగానూ చించడం లేదు— ఆడ, మగ రచయితలు అన్నాను. ఆడదాన్ని నీచంగా చూడ్డానికి ఒక్క మగవాడికే ఉంది హక్కు అని నమ్మేటంత చిన్నపిల్లని అనుకోకండి సార్.

**డి. ఎ, నంద్యాల**

జీవితాంతం ఒక మనిషిని వెంటాడేది ఆశా? నీడా? స్వార్థమా?

నీడ నెలాగైనా వదుల్చుకోవచ్చు. ఆశని, స్వార్థాన్ని మాటుకు వదుల్చుకోవడం అసంభవం— సర్వసంగ పరిత్యాగం చేసిన సన్యాసులు కూడా!



విజయలక్ష్మీమూవీస్‌వారి రెండవ చిత్రానికి వాహినీ స్టుడియోలో శ్రీ చక్రపాణి కెమేరా స్విచ్ ఆన్ చేశారు. దర్శకుడు రామచంద్రరావు, నిర్మాత జి. వి. ఎస్. రాజు, నాట్యకళా సరస్వతి (నవయుగ) గార్లని కూడా చిత్రంలో చూడవచ్చును.

# సినిమా

## ఉగాదిరోజు అక్కినేని పుట్టినరోజు

హీరో నాగేశ్వరరావు మద్రాసులో వున్నట్టు, ఉగాది రోజున ఆయనపుట్టిన రోజు పండుగను వాహినీ స్టుడియోలో రంగ రంగ వైభవంగా జరుపుకుంటున్నట్లు తెలిసింది. నేను వెళ్ళాను. అక్కినేని టిప్ టాప్‌గా డ్రెస్‌అప్‌అయి, చూపరులకు అసూయ కలిగేంతటి అందంగా కనిపించారు.

## జీవితాల చేదునిజాలు

నాగేశ్వరరావుకు పుట్టినరోజు అంటే, ఎంతమంది గ్రీట్ చెయ్యడానికి వస్తారో మీకు తెలియదా? పెద్దలు, పిన్నలు, ధనవంతులు, పేదలు అందరూ పాల్గొన్నారు. అంతేకాదు — అందమయిన నెరజాణలు ఆరుగురు హీరోను చుట్టుముట్టేసి ఆయన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే, ఆయన అందరినీ సమాధానపరచ గలిగారు. తన్ను అభినందించడానికి వచ్చిన వ్యక్తులకొక్కొక్క చూసారు. తన మనస్సు ఏమో చెప్పుకున్నట్లుగా సాదరం ఒకమాట, అక్కినేని. అనేక సమయాల్లో మీకు తెలియాలిగా.

నేను పుట్టాను లోకం మెచ్చింది
నేను ఏడ్చాను లోకం నవ్వింది
నేను నవ్వాను లోకం ఏడ్చింది
నాకింకా లోకంతో పనేముంది'

అని తన అనుభవసారాన్ని వివరించారు హీరోగారు. అక్కినేని పుట్టినరోజు సెప్టెంబరు 20 న గదా; మరి మార్చి 27 న బర్త్‌డేపార్టీ ఎలా జరిగింది అన్న సందేహం మీకు కలగడం సహజం. ఈ పుట్టినరోజు సురేష్‌మూవీస్‌వారి ప్రేమనగర్ నాయకునికి సంబంధించినది మాత్రమే.

అనేక వ్యయప్రయాసలకోర్చి, భారీ ఎత్తున, సర్వజన రంజకంగా నిర్మించడానికి నిర్మాత రామానాయుడు తీసుకుంటున్న శ్రమ, శ్రద్ధ వృథాపోదు. తెలుగుచిత్రసీమలో ప్రేమనగర్ ఒక అమరచిత్రకావ్యంగా నిలబడి పోగలదేమో అనిపిస్తుంది. ఇటీవల నాకువచ్చిన పాత్రల్లోకి ప్రేమనగర్ కథానాయక పాత్ర చాలా క్లిష్టమయినది మాత్రమేగాక నా ట్యాలెంటుకు చాలెంజి లాంటిది అన్నారు నాగేశ్వరరావు. ఆచార్య ఆత్రేయ మాటలు ఒకప్రక్క హృదయాన్ని కదలిస్తే మహాదేవన్ పాటలు మరొకప్రక్క మనస్సును దోచేస్తుంది. ఎస్. వెంకటరత్నం ఛాయాగ్రహణం ప్రత్యేకశోభను చేకూర్చగలదు. డి. రామానాయుడు నిర్మిస్తున్న కలర్ ప్రేమనగర్ నాయిక వాణిశ్రీ; దర్శకుడు కె. ఎస్. ప్రకాశరావు; విడుదల— నవయుగ.

## బాపమురదకు వాణిశ్రీ

## క్రిష్ణకు నరకం

హీరో క్రిష్ణకు మద్రాసు సమీపానవున్న ఒక గ్రామంలో కొంత పొలంవుంది. వీలు దొరికినప్పుడల్లా, అక్కడికి వెళ్ళి తనే అన్ని పనులుచేసే అలవాటువుంది. ఒకరోజు క్రిష్ణ వేకువజాము అయిదుగంటలకల్లా పొలం గట్టుకు పయనమయ్యారు. పొద్దు మధ్యాహ్నం వరకు పొలంలో దిగి, నారుపోసి నీళ్ళుపట్టి అలసిపోయారు. కడుపులో ఆకలి దహించుకుపోయింది. పొలంగట్టుకు ప్రక్కనవున్న చెట్టుదగ్గర కూర్చున్నారు



శాంతి కాపురం'లో వాణిశ్రీకి అందరి పుస్తకం పేరు 'బృందావనం' (మొదటి భాగం.) అందకుండా చేసే వ్యక్తి మీనాకుమారి.

చివరిరాకనే నిరీక్షిస్తున్నట్టు తెలిసింది. పది నిమిషాలకల్లా వెనకమాటుగా ఒక అమ్మాయి వచ్చింది. క్రిష్ణకు క్యారియరును అందించి, దూరంగా చూచింది. క్రిష్ణ ఆమెను సూటిగా చూసాడు. అతగాడి చూపులకు ఆగలేక వాణిశ్రీ పరుగులెత్తింది. క్రిష్ణ కూడా ఆమెను వెంబడించాడు. ఎలాగో తెలుసా?

'పాలపిట్ట; పాలపిట్ట; పరుగులెందుకు?
వరస్సైన బావతోటి వాదులెందుకు?
టిక్కులు నిక్కులు ఎన్నాళ్ళు? నీకు
ముక్కుతాడేసిన మూన్నాళ్ళే'

అంటూ వాణిశ్రీని దెప్పి పొడిచాడు. మరి ఆమె మాత్రం పూరకున్నదా?

'పాలపిట్ట వెంట నీకు పరుగులెందుకు
అంత వరస్సైన బావనయితే నాను
తెందుకు
గీరలు జోరులు ఎన్నాళ్ళు
నాగలి తగిలితే రెన్నాళ్ళే'

అని పాడింది. ఈ బావా మరదళ్ళ సరసం నందినీ ఫిలింస్‌వారి 'అత్తలు—కోడళ్ళు' చిత్రంలో హైలైటుగా వుంటుంది. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయాగ్రహణాన్ని, మహదేవన్ సంగీతాన్ని, పినిసెట్టి సంభాషణ కర్తృత్వాన్ని నిర్వహిస్తున్నారు.

## సూర్యకాంతం దబ్బుదాహం

ఏటి సూర్యకాంతానికి బోలెడంత సంపాదన వుంది. అయినా ఆమెకు ధనదాహం తగ్గలేదు. అందుకే కొన్ని లక్షలకు ఆస్తిపరుడయిన నాగేశ్వరరావును లౌకిక ప్రపంచంతో సంబంధం లేకుండా పెంచింది. ఆయనకు మేడపైన ఒక ప్రత్యేక గదిని కేటాయించింది. ఆయనకు అమ్మానాన్న, ఆస్తిపాస్తి ఆ రూము ఒక్కటే. ప్రతి రోజూ మధుపానం చెయ్యడం, మజాగా మదవతులతో కులకడం అలవాటు అయింది. ఒకరోజు జయకుమారి అక్కినేని గదిలోకి వచ్చింది. ఆమెను నాగేశ్వరరావు కొంటెగా చూసాడు. అబ్బ! ఎంత అందగాడు అను కుంది జయకుమారి. సంతోషం వెల్లువి కింది.

'కొంటెచూపు లెందుకు లేరా



సత్యచిత్ర సంస్థ కొత్త చిత్రం ప్రారంభంనాడు ముఖ్యనటి జమున. క్లాప్‌కొట్టిన శ్రీ బి. నాగిరెడ్డి. కెమెరా స్విచ్ ఆన్‌చేసిన శ్రీ పి. వి. శివరామకృష్ణయ్య (లక్ష్మీ ఫిలింస్).

కాంటి తేనె లద్దిస్తారా
నీవు నాకు తోడైవుంటే
లోకాలే గెలిచేస్తారా'

అంటూ నాగేశ్వరరావును గట్టిగా కావలించుకుంది. 'కట్' అన్నారు దర్శకుడు ప్రత్యగాత్మ. ఈ సన్నివేశం విశ్వభారతి ప్రొడక్షన్స్‌వారి 'శ్రీమంతుడు' చిత్రంలో కనిపిస్తుంది! జి. రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్న 'శ్రీమంతుడు' చిత్రానికి ముళ్ళపూడి కథ, మాటలను, చలపతిరావు సంగీతాన్ని, రామకృష్ణారావు ఛాయను, అక్కినేని వెంకటరత్నం ప్రొడక్షన్ కంట్రోలింగును, సుబ్బారావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. నాగేశ్వరరావు, జమున, గుమ్మడి, సూర్యకాంతం, రమణారెడ్డి, రావికొండలరావు, జయకుమారి ముఖ్యపాత్రధారులు. ప్రత్యగాత్మ దర్శకత్వ ప్రతిభ అడుగడుగునా కనిపించి, ప్రతి సన్నివేశం బాగా పండినందు

## సినిమా

వల్ల, చిత్రం చూపరులకు ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తుంది.

## ఆనంద నిలయం

మెర్క్యురీ సంస్థ నిర్మించిన సాంఘిక చిత్రం. 1964లో ప్రారంభమయింది. 1971లో విడుదల కాబోతూంది. ఏడు సంవత్సరాలు అనేక యిబ్బందులకు గురి అయింది. ఇప్పటికి కష్టాలు తీరిపోయాయి. ఈ చిత్రానికి బి. ఎస్. నారాయణ దర్శకుడు. ఇది దర్శకునికి లెక్కకు నాల్గవ చిత్రం. ఇది ప్రారంభమయిన తర్వాత బి. ఎస్. నారాయణ పది చిత్రాలను డైరెక్టు చేశారు. 'ఆనంద నిలయం' దర్శకుని 14వ చిత్రం అయిందిప్పుడు. ఒకనాటి మేటి తారగా ప్రకాశించిన కృష్ణకుమారి యీ

చిత్రంలో నాయిక. నేటి ప్రముఖతార వాణిశ్రీ యీ చిత్రంలో ఉపనాయిక. హాస్యబ్రహ్మ రేలంగి ప్రధాన పాత్రధారి. ఇంకా కాంతారావు, రాజనాల, చలం ముఖ్య పాత్రల్లో కనిపిస్తారు.

## సుపుత్రుడు

మాధవీ కంబైన్స్ నిర్మించిన చిత్రంలో టైటిల్ పాత్రను నాగేశ్వరరావు ధరించారు. లక్ష్మి (యిప్పుడు తొమ్మిది మాసాల గర్భవతి) అక్కినేనితో నాయికగా నటించిన మొదటి చిత్రం. నాగేశ్వరరావు అమ్మగా



'రైతుబిడ్డ'లో అనూరాధ

అంజలీదేవి, తండ్రిగా జగ్గయ్య నటించారు. విజయచంద్ర ఒక ముఖ్యభూమికను నిర్వహించాడు. రాజనాలకు కొత్తపాత్ర యివ్వబడింది. కథ తమిళ రచయిత గుహనాథన్‌ది; మాటలు మనసులు మారాలి శివరామకృష్ణయ్యవి; సంగీతాన్ని మహదేవన్, ఛాయను సెల్వరాజు, దర్శకత్వాన్ని తాతినేని రామారావు నిర్వహించారు. సుబ్బారావు అండ్ ప్రసాద్ నిర్మించిన ఈచిత్రం అతి త్వరలో లక్ష్మీ ఫిలింద్వారా దర్శనమిస్తుంది.

## సినిమా డైరీ

- సురేష్‌మూవీస్ 'ప్రేమనగర్' షూటింగు ఏప్రిల్ 6 నుండి 12 వరకు ఊటీలో జరిగింది. నాగేశ్వరరావు, వాణిశ్రీ, నటించిన దృశ్యాలను కె. ఎస్. ప్రకాశరావు చిత్రీకరించారు.
- నవభారత్ 'రైతుకుటుంబం' అవుట్‌డోర్ ఏప్రిల్ 4, 5, 6 తేదుల్లో జరిగింది. నాగేశ్వరరావు, కాంచన, పాల్గొన్న సన్నివేశాలను తాతినేని రామారావు చిత్రీకరించారు.
- విశ్వభారతి ప్రొడక్షన్స్ 'శ్రీమంతుడు' నాయిక జమునను హీరో నాగేశ్వరరావు టీజ్ చేసే పాటను కె. ప్రత్యగాత్మ మార్చి 1 నుండి 3 వరకు చిత్రీకరించారు.
- గోత్తాస్ పిక్చర్స్ 'అత్తను దిద్దిన కోడలు' మార్చి 22, 23 తేదుల్లో వాహినిలో జరిగింది. గుమ్మడి, రాజనాల, విజయలక్ష్మి నటించారు. బి. ఎస్. నారాయణ దర్శకుడు.
- మార్చి 27 (ఉగాది) న అన్నపూర్ణా కంబైన్స్ వారి మొదటి పాట (అనుభవ ప్రాసనది) ఆత్రేయ సారథి చక్రవర్తి నాయుడు ఎల్. ఆర్. ఈశ్వరిచే పాడించారు. జి. రామినీడు దర్శకుడు.




# విచిత్ర దాంపత్యం

నిర్మాత పి. చిన్నపరెడ్డి M.Sc.
దర్శకత్వం పి. చంద్రశేఖరరెడ్డి

ఇది



'శ్రీమంతుడు'లో జమున, గుమ్మడి



'డబ్బుకు లా దొంగల ముఠా'లో వాణిశ్రీ.

# సినిమా

## విజయవాడ ఇష్టాగోష్ఠి

మోడరన్ థియేటర్స్ 110 వ చిత్రం అవుట్‌డోర్ షూటింగు యిటీవల విజయవాడ, తెనాలి, గుంటూరు మున్నగు ప్రాంతాల్లో జరిగింది. నవయుగ ఫిలిమ్స్ మార్చి 16 న హోటల్ మనోరమ (విజయవాడ) లో యూనిట్‌కు తేనేటివిందు అరేంజిచేసి, పత్రికలవారితో యిష్టాగోష్ఠి జరిపారు.

## తక్కువనిడివి చిత్రాలకు ఆదరణ

గుమ్మడి:— ఆంగ్లంలోవలె తెలుగులో కూడా తక్కువనిడివి చిత్రాలువస్తే మంచిది. తక్కువనిడివి చిత్రాలకు అధిక లాభాలు వస్తున్నాయి. అలాంటి చిత్రాలను చూడడానికి తెలుగు ప్రేక్షకులు అలవాటు పడాలి. ఆ అభిరుచిని యేర్పరచే బాధ్యత పాత్రికేయులదే. ముఖ్యంగా ఒక చిత్రంలో క్రయిం సస్పెన్స్, స్టంట్స్, హాస్యం, సంగీతం అన్ని గుప్పించేకంటే — హాస్యచిత్రాలు, సంగీత చిత్రాలు సపరేట్‌గా నిర్మిస్తే జనం చూడగలరనే నమ్మకం నాకువుంది. ఇవాళ గాకపోయినా, పదేండ్లతర్వాత అయినా తక్కువ నిడివి చిత్రాలు రాకతప్పదు అని వుద్ఘాటించారు.

నవయుగ కాట్రగడ్డ నరసయ్య: — 'పది సంవత్సరాలెందుకు. ఇపుడు వస్తున్న గూఢచారి, సస్పెన్స్ చిత్రాలు చూస్తే మిగతా వాటికన్నా నిడివి తక్కువే; కాబట్టి తక్కువ నిడివి చిత్రాలను జనం చూడరని నేను అనుకోను. కొత్తదనం, వేగం వుంటే జనం చూస్తారు. తక్కువ నిడివి చిత్రాలు రావాలంటే, నిర్మాతలు ముందుకు రావాలి. గుమ్మడిగారు అన్నట్లు నిర్మాణ వ్యయం బాగా తగ్గుతుంది' అన్నారు అంతేకాదు. కథల కోసం బెంగాలి చిత్రాలను వెతకనవసరం లేదు. మలయాళ భాషలో కొత్తదనంతోనూ. సంఘ సంస్కరణీయమైనవిగానూ చాలా కథలు వస్తున్నాయి. అలాంటి చిత్రాలు తెలుగులో కూడా ప్రజాదరణ పొందగలవు అని నరసయ్య వివరించారు. అనిల్ ప్రభాస్ ఎంటర్‌ప్రయిసెస్ తరపున అంకినీడు వందన సమర్పణ చేసారు.

## హైద్రాబాదు షూటింగు : నిర్మాత అవస్థలు

పూర్ణా ఆర్ట్సు పిక్చర్స్ నిర్మాత అట్లూరి పూర్ణచంద్రరావును వారి ఆఫీసులో కలిసి 'హైద్రాబాదు అవుట్‌డోర్ బాగా జరిగిందా?' అని ప్రశ్నించాను. 'లేదు. అక్కడ మాకు చాలా సమస్యలు ఎదురయినాయి' అని—

'మా రెండవ చిత్రం 'కూతురు కోడలు' షూటింగును (హైద్రాబాదు అవుట్‌డోర్) చెయ్యదలిచాము. శ్రీఫిలిమ్స్‌వారి సహకారంతో మేము షూట్ చెయ్యదల్చుకున్న స్థలాలన్నింటికీ నాలుగు రోజుల ముందే పర్మిషన్ పొందాము.

'ఆంధ్ర ప్రభుత్వం సినిమా పరిశ్రమకు ఎంతో ప్రోత్సాహమిస్తుందని అందరూ అంటుంటే నిజమనుకున్నాం. అందుకే నవ్‌బత్‌పహాడ్, పబ్లిక్ గార్డెన్స్, నెహ్రూ జూలాజికల్‌పార్క్, గోల్‌కొండ ఖిల్లా, గండిపేట చెరువు ప్రాంతాలను మా అవుట్‌డోర్ లొకేషన్స్‌గా నిర్ణయించుకొన్నాం. తీరా అక్కడ మేముపడ్డ బాధలను నెమరువేస్తే మున్ముందు హైద్రాబాద్‌కు రాకూడదు అనిపించింది.

'అన్నిచోట్లకు ఒకేరేటు అద్దెకాకుండా నవ్‌బత్ పహాడ్, పబ్లిక్ గార్డెన్స్‌కు రోజుకు రు. 100 అద్దె. నెహ్రూ పార్కుకు రు. 250, గండికోట చెరువుకు మరొక రేటు— గోల్‌కొండ ఖిల్లాకు రు. 10 వేలు డిపాజిట్‌కట్టి కేంద్ర ప్రభుత్వం అనుమతి ఢిల్లీనుండి కావాలట! తీరా ఆయా రేట్లనుబట్టి అద్దెకట్టి షూటింగ్‌కు వెళితే అక్కడ చిన్న అధికారులు విచక్షణ లేకుండా అనవసరమైన నిబంధనలతో అనేక చికాకులను కల్గించారు. పబ్లిక్ గార్డెన్స్‌లో ఒకభాగమైన పిల్లల కేంద్రంలో షాట్స్ తీయకూడదట. పార్క్‌కు సెలవురోజైన సోమవారం షూటింగ్‌కు పర్మిషన్ ఇవ్వరట. అనుమతిపొందిన మేము లోపలికి వెళ్లాలన్నా ప్రవేశ రుసుము కట్టవలసిరావడం విచిత్రంగా వుంది. ఎట్టి పరిస్థితులలోను 8 గంటలకు ముందు గేటు తీయరట.

'గోల్‌కొండ ఖిల్లాలో షూటింగ్ జరపాలంటే ఢిల్లీనుండి పర్మిషన్ వుండాలన్నారు. ఒక్కపూట షూటింగ్‌కు 10వేల రూపాయలు డిపాజిట్ కట్టమనడం ఎంత దారుణమో చూడండి. ఇలాంటి పరిస్థితులలో రాష్ట్రప్రభుత్వం జోక్యం కల్గించుకొని, హైద్రాబాద్‌లో ఎక్కడ షూటింగ్ జరిపినా ఒకేరేటు అద్దెను వసూలుచేసి ఛోటా అధికారుల జోక్యాన్ని అరికట్టడం మంచిది. అలాగే గోల్‌కొండ ఖిల్లా వాడకానికి (షూటింగ్) రాష్ట్రప్రభుత్వమే

### మీకు తెలుసా?

నటి కె. ఆర్. విజయకు స్వంత 'పావజీనా, ఫస్ట్‌లవ్' (గుర్రాలు) గిండీ రేసుల్లో బాగా పరుగెత్తాయి.

ప్రముఖ నిర్మాత సుందరలాల్‌నహతాకు 'అభిమన్యు' అనే గుర్రం వుంది.

'నవశక్తి' గుర్రం 'జీవిత చక్రం' నిర్మాత గంగాధరరావుకు స్వంతమట.

'ఆస్ట్రొనాట్' యొక్క ఓనర్ వి. బి. రాజేంద్రప్రసాద్ అట.

నటి, నర్తకి రాజసులోచన అమెరికాలో నృత్య ప్రదర్శన ద్వారా చాలా డబ్బు గడిస్తున్నట్లు తెలుస్తూంది.

ఫుల్ డ్రెస్‌లో జ్యోతిలక్ష్మి:
'మోసగాళ్ళకు మోసగాడు'లో

పర్మిషన్ ఇచ్చేలా చూడగలిగితేనేతప్ప నాలాంటి నిర్మాతలు హైద్రాబాద్‌లో షూటింగ్ జరపలేరు' అని వివరించారు అట్లూరి పూర్ణచంద్రరావు.

## వింత సంసారం

తమిళంలో 'వియత్నాంవీడుగ' విజయ విహారంచేసి ఇపుడు తెలుగులో వింతసంసారం రూపంలో ఆంధ్రప్రేక్షకులకు దర్శన మివ్వబోతుంది. ముఖ్యనటి సావిత్రి ఈచిత్రానికి డైరెక్టర్. ఒక కంటబిడ్డల్ని మరొక కంట తాళికట్టిన భర్తను సముదాయించుకొనే స్త్రీ మూర్తిగ సావిత్రి; మనిషికి ఏది పోయినా బ్రతకొచ్చు కాని పరువుపోతే మాత్రం బ్రతకలేడు అను సిద్ధాంతవాదిగా జగ్గయ్య; క్రొత్తతరహా నటనను అగుపరచారు. అడ్డాలనాడే బిడ్డలు. పెరిగి పెద్దయ్యాక బిడ్డలా అనే సమస్యాత్మక కుటుంబగాథయే ఈవింత సంసారం. చిత్రంలోని ముఖ్యపాత్రలను చలంమోహన్, రాజబాబు, నాగయ్య, అల్లు రామలింగయ్య, సి. హెచ్. నారాయణరావు, రామచంద్రరావు, సాక్షి రంగారావు, సీతారాం, రమాప్రభ, మాలతి, లీలారాణి పోషిస్తున్నారు. సావిత్రి, దిడ్డి శ్రీహరిరావు నిర్మిస్తున్న ఈచిత్రానికి మద్దిపట్ల సూరి మాటలను కోదండపాణి సంగీతాన్ని, శేఖర్‌సింగ్ ఛాయను, బి. ఎన్. కృష్ణ శిల్పాన్ని, దాసరి నారాయణరావు సహాయ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు. విజయా రిలీజు.

## సర్కస్ కిలాడీలు

క్రయిమ్; స్టంట్లు; మనోహరమైన నాట్యాలుతోకూడిన లక్ష్మీ చిత్రవారి సర్కస్ కిలాడీలు తెలుగు చిత్రం ఏప్రిల్ నెలలో ఆంధ్రదేశమంతటా విడుదల కాబోతూంది. ఇందులో రాజకుమార్; ఉదయకుమార్; నరసింహరాజు, ఉదయచంద్రిక సాధన మొదలగువారు నటించారు. రచన: కొడాలి; దర్శకత్వం గోపాల్, ఎడిటింగు కృష్ణమూర్తి; నిర్మాతలు యం. వి. రెడ్డి ఎ. యస్. రాజు.

—శ్రీనివాస్

**అవీ.. ఇవీ:**

### శ్రీకాకుళంలో సినీతారల వినోద ప్రదర్శనాలు

శ్రీకాకుళం ఆడిటోరియం నిర్మాణం సహాయార్థం ఏర్పాటు చేసిన సినిమా తారల వినోద ప్రదర్శనాలలో నాటిక నృత్య ప్రదర్శనాలు, లలిత సంగీత కార్యక్రమములలో సినీ నటులు టి. ఎల్. కాంతారావు, ధూళిపాళ, రామ్మోహన్, రావికొండలరావు, నాగరాజు, త్రినాధరావు, నటీనటులు కాంచన, గౌరి సిస్టర్స్ ప్రసన్నరాణి. రాధాకుమారి, ఇందిర, లక్ష్మీకాంతమ్మ, నేపథ్యగాయకులు శ్రీమతి రమణ, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం మొదలగు వారు పాల్గొన్నారు. ప్రదర్శనాలలో పాల్గొన్న నటులకి శ్రీమతి కృష్ణకుమారి ఆడిటోరియం తరఫున మెమొంటోలు బహూకరించారు. —ఒ. వి.

* * *

విజయవాడలో నెల 17 వ తేదీ రాత్రి స్థానిక వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయంలో విజయవాడ శ్రీధర్ ఆర్ట్సు థియేటర్సు వారి 'శ్రీ కన్యకావతరణం' శ్రీ కన్యకా పరమేశ్వరి కథ నాటక ప్రదర్శనం జరిగింది. ఈ నాటక ప్రదర్శనానికి శ్రీ వేమవరపు శ్రీధరరావు దర్శకత్వం వహించారు. [ఒ. వి.]

## మా టినీ ఆఫ్ ఇన్నోసెంట్స్

రచన, బి.సి. దత్, డెమ్మీ సైజు, పుటలు 238 ప్రతులకు సింధూ పబ్లికేషన్స్ ప్రైవేట్ లిమిటెడ్— బొంబాయి—1. వెల 25 రూపాయలు.

1946 ఫిబ్రవరి 18వ తేదీన, బొంబాయి నౌకాశ్రయంలో అకాలంలో రాయల్ ఇండియన్ నేవీ అనే పేరుతో చలామణి అవుతున్న భారతీయ నౌకాదళంలో ఆకస్మాత్తుగా ఒక తిరుగుబాటు చెలరేగింది.

అంతకు మునుపే రేటింగ్స్ అన్న భారతీయ నౌకాదళంలో చిన్న తరహా ఉద్యోగులు కొందరు బ్రిటిష్ అధికారులు తమయెడల చూపిస్తున్న అవమానకరమైన వైఖరులతో, అనేక విధాలయిన అసౌకర్యాలతో, బొత్తిగా నోట పెట్టుకోలేని ఆహార పదార్థాలతో, అన్నపానాలతో, అట్టుడికినట్టు ఉడికి పోతున్నారు. వారందరూ ఒక్కసారిగా తిరుగుబాటు చేశారు. అది క్రమముగా అనేక నౌకలలో వ్యాపించింది. వరుసైన పులనిప్పంటుకున్నట్టు భగ్గుమని ప్రజ్వరిల్లించింది. కొన్నినౌకలు రేటింగ్స్ స్వాధీన పరచుకొనేదాకా ఈ తిరుగుబాటు వ్యాపించింది. బ్రిటిష్ నౌకల సైనికాధికారుల కిది భ్రాంతి కలిగించింది వారీ తిరుగుబాటు నాలుగైదు రోజులలోనే పూర్తిగా అణచివేశారు. ఎంతో మంది రేటింగ్స్ అనేక విధాల శిక్షలకులోనై దిక్కుమొక్కులేక కారాగారాలలో పడి మగ్గిపోయారు.

ఆ సమయంలో అహింసా పద్ధతులద్వారా స్వాతంత్ర్య సమరం సాగిస్తున్న దేశీయ నాయకులెవరికీ ఈ తిరుగుబాటు పట్టలేదు. ఏవో కొన్ని అసౌకర్యాల కారణాలవల్లనే మొట్టమొదట ఈ తిరుగుబాటు ప్రారంభించినా, క్రమక్రమంగా ఇది జాతీయ స్వాతంత్ర్య సమరం లక్ష్యాలందుకున్నది. కాని ఏమి లాభం? ఆనాడు దేశంలో ఏ ఒక్క రాజకీయ పక్షమూ తిరుగు బాటు దారులకు తగినంతచేయూత ఇవ్వలేదు సరికదా, తగినంత సానుభూతికూడా, వ్యక్తీకరించలేదు అందువల్ల ఆతిరుగుబాటు పుట్టబోతూనే పుట్టిమునిగి వాడిపోయింది. రేటింగ్స్ చాలా మంది అనేక విధాల కష్టనష్టాల పాలయ్యారు. త్వరలోనే స్వాతంత్ర్యం లభిస్తుందనుకోవాలన్న ఆతురతతో దేశీయనాయకులలో ప్రముఖులు లొంగిపోవలసిన దని రేటింగ్‌లకు సలహా ఇచ్చారు. వారికిక గత్యంతరంలేక లొంగిపోయారు. దానితో తిరుగుబాటు కథ ముగిసింది.

ఈ ఆంగ్ల గ్రంథ రచయిత ఆనాటి తిరుగుబాటు లేవదీసిన రేటింగు నాయకులలో ప్రముఖులు. పత్రికారచయిత. ఈయన రచనలో ఆనాటిసంఘటనలన్నీ కళ్ళెదుట జరిగినట్టు కదిలి పోతాయి.

ఇది చరిత్రలో సుస్థిరంగా నిలిచి పోయినతిరుగుబాటు. సిపాయి మ్యూటినీతో, ఇండియన్ నేషనల్ ఆర్మీ పోరాటంతో తులతూగజాలిన పోరాటమిది. ఈ పోరాటంలో పాల్గొంటున్న రేటింగుల ముఖచిత్రంతో వెలువడిన ముద్రణలో ఇది చరిత్రకారులకేకాక, సామాన్య పాఠకులను కూడా కదిలించి వెయ్యగల రచన.

# పుస్తకాలు

## స్పాన్ ఆఫ్ లైఫ్

జ్యోతిషాచార్య గోవిందు శ్రీరామమూర్తి. ప్రతులకు: డైరెక్టర్, భారత్ ఆస్ట్రాలజీ ఇన్‌స్టిట్యూట్ 7—2—28 న్యూకాలనీ. శ్రీకాకుళం ఎ.పి. వెల 5 రూపాయలు. మేలు ప్రతి 12 రూపాయలు.

జ్యోతిషశాస్త్రంలో ఆయుర్దాయ నిర్ణయం చాలా జటిలమయినది. మొట్టమొదట స్పష్టంగా ఆయుర్దాయ నిర్ణయం జరిగితేగాని ఫలితాలనిర్ణయం వీలుపడదుకదా!

దీనికి ప్రాచీన జ్యోతిషశాస్త్రంలో అనేక పద్ధతులున్నాయి. ఆయుర్దాయం నిర్ణయించే ముందు మొట్టమొదట బాలారిష్టాలనిర్ణయం జరగాలి. ఆపైన అల్ప మధ్యపూర్ణాయుర్దాయాల సమన్వయం చేయటం చాలా అవసరం.

గ్రంథకర్త ఈ ఆంగ్ల గ్రంథంలో మన జ్యోతిష శాస్త్రంలో ఆయుర్దాయానికి సంబంధించిన వేర్వేరు విషయాలన్నీ చక్కగా క్రోడీకరించారు. బాలారిష్టాలు, ఆయా అల్పమధ్యపూర్ణా ఆయుర్దాయాల నిర్ణయంలో ముఖ్య యోగాలు, జైమినీయపద్ధతి నక్షత్రాయుర్దాయము, గోచారాయుర్దాయము, అష్టక వర్గాయుర్దాయ నిర్ణయము, దశాంతర్దశలను బట్టి ఆయుర్దాయ నిర్ణయము మొదలయిన ఆయుర్దాయ నిర్ణయ పద్ధతులన్నీ ఈ పుస్తకంలో కూలంకుషంగా వివరించడం జరిగింది.

నిజానికి ఆయుర్దాయానికి సంబంధించిన వివరాలకు, వివేచనలకు ఈ పుస్తకం ఒక చక్కని క్రోడీకరణం

గ్రంథం చివరకొన్ని ఉదాహరణ జాతకాలుకూడా ఇచ్చి, తాము పేర్కొన్న సిద్ధాంతాలన్నీ గ్రంథకర్త సోదాహరణంగావివరించారు.

—శాస్త్రి



ఒకనాటి వెండి తెర అందాలరాణులు ఇపుడు ఏం చేస్తున్నారని పలువురు అడుగుతూ వుంటారు. ఒకనాటి అందాల రాణులంటే మరీ పాతకాలం వారు కాదు. ఇటీవలి కాలం వారి గురించి నేను రాస్తున్నది.

రెండు దశాబ్దాలకు పైనా తెలుగు సినిమా చిత్ర పరిశ్రమలో పేరుమోసిన తారలుగా, చక్కని నటీమణులుగా వెలుగొందిన వారి గురించి మాత్రమే యిక్కడ పేర్కొంటున్నది అలాంటి వారిలో శ్రీమతులు భానుమతి, అంజలీదేవి, జి వరలక్ష్మి ఎస్. వరలక్ష్మి, కృష్ణవేణి ముఖ్యులు. వీరంతా ఇరవై ఏళ్ళుగా ప్రేక్షక లోకానికి బాగా జ్ఞాపకం వున్న నటీమణులు. ఒకనాటి కథానాయికలు.

ఈనాడు వీరి కార్యకలాపాలేమిటి? ఏం చేస్తున్నారు. సినిమాలలో ఇపుడు ఏతరహా పాత్రలు పోషిస్తున్నారు. అంటూ తరచు అడుగుతుంటారు కొందరు. వారు అభిమానించిన నటీమణులు గనుక, వారి హృదయాలలో నిలిచి పోయిన నాయకులు గనుక, అలా అడగటం సహజం.

* * *

## ఒకనాటి. నాయికలు

కాలం ముందుకు జరిగే కొద్దీ వయసు మీద పడుతూ వుంటుంది. వయసు మీద పడే కొద్దీ గ్లామర్ సన్నగిల్లుతుంది. ఎప్పుడూ కొత్తదనాన్ని కోరే ప్రేక్షకులుతరిగిన గ్లామర్‌తో తారల్ని రిసీవ్ చేసుకోలేరు. గ్లామర్‌ను ఎప్పటికప్పుడు అభివృద్ధి చరచుకునే ప్రయత్నాలు చేస్తారు, తారలు అందుకే!

* * *

పైన పేర్కొన్నవారంతా ప్రతిభ గలిగిన నటీమణులు గనుక ప్రేక్షకుల దృష్టిలో నిలిచిపోయిన వారు గనుక, వారిచేత కేరక్టర్లు చేయిస్తున్నారు. మన నిర్మాతలు.

శ్రీమతి భానుమతి ఈ మధ్య వచ్చిన మట్టిలో మాణిక్యంలో చలానికి వదినగా నటించారు. అయితేనేం తన అసాధారణ నటనా ప్రతిభనే చిత్రాన్ని రక్తి గట్టించి, తన ఔన్నత్యాన్ని మరోసారి రుజూచేసుకున్నారు.

అలాగే అంజలీదేవి జి. వరలక్ష్మి ఎస్. వరలక్ష్మి యిపుడు కేరక్టర్లుచేస్తూ ఆనాడు వలెనే ఈనాడూ విజయాలను సాధిస్తున్నారు.

కృష్ణవేణి చిత్రాలనుంచి పూర్తిగా విరమించుకున్నారు. ఆమె తమిళ చిత్రాలను తెలుగులోకి డబ్ చేస్తూ నిర్మాతగా వ్యవహరిస్తున్నారు. కిందటి వారమే జగత్ కంత్రీలు పేరిట ఒక డబ్బ్ చిత్రాన్ని విడుదల చేశారు కృష్ణవేణి.

—మోహన్ కుమార్

# రంగుల రాజ్యం

(54 వ పేజీ తరువాయి)

కాశం ఉంది. జర్మన్ మీజిల్సు అనేది అంత తీవ్రమైనది కాదు. కాని గర్భవతులకయితే పుట్టబోయే పిల్లలు వికారం కావడానికి అవకాశం ఉంది.

మశూచి తీవ్రమయినది. రూపవికారము, అధిక సంఖ్యలో మరణాలు సంభవిస్తాయి. 1798లో ఎడ్వర్డు జెన్నర్ వాక్సినేషను ప్రారంభించాడు. ఆవుల మశూచి క్రిమిసిమన శరీరంలో ప్రవేశపెట్టాడు. (ఆ క్రిమి అంత తీవ్రంకాదు) అసలు మశూచి రాకుండా కాపాడుతుంది. ఇప్పుడది సర్వత్రా వ్యాక్సినేషన్ తీసికొంటున్నారు. 20, 30 సంవత్సరాల క్రితం మశూచి వల్ల ముఖ లక్షణాలతో మనుష్యులు విరివిగా కనబడేవారు. ఇప్పుడు





... అయ్యారు. ఎడ్వర్డు జెన్నరుకు అందరూ కృతజ్ఞత చూపాలి!

# ధర్మపథం

(45 వ పేజీ తరువాయి)

పట్టుకోనకుండా రాజదర్శనానికి వెళ్తే అగౌరవ పరచినట్లు కూడాను.

రాజదర్శనానికే ఉత్తచేతులతో వెళ్లకూడదన్నప్పుడు — దేవదర్శనానికి వెళ్ళవచ్చా? అందువల్లనే గుడికి ఫలపుష్పాదులు పట్టుకొనే వెళ్లవలసి ఉన్నది

గురువు త్రిమూర్తి స్వరూపుడనీ, పరబ్రహ్మ స్వరూపుడనీ మనవారి నమ్మిక. విద్యా గురువునకు వినయం చూపడం గౌరవించడం, ఎంతో ఉచితం. అందువల్ల ఆయన దర్శనానికిన్నీ ఉత్తచేతులతో పోకూడదు.

# సోవియట్...

(13 వ పేజీ తరువాయి)

విద్యా సంవత్సరాన్ని ముగించే విద్యార్థులందరూ ఇక పైన మాధ్యమిక విద్యాసంస్థలలో చదువుకొంటారు. ప్రజల సాంస్కృతిక అవసరాలను తీర్చడానికి ప్రత్యేక ప్రాముఖ్యత కల్పించడం జరుగుతుంది. పత్రికలు, టెలివిజన్, రేడియో, సాహిత్యం, కళలు అభివృద్ధి చేయబడతాయి.

సోవియట్ ప్రజల గృహవసతుల విషయం పరిశీలిస్తే గతంలో 100 మిలియన్లకు పైగా సోవియట్ పౌరులు నూతన గృహాలలోకి మారారు. నూతన ప్రణాళికా లక్ష్యాల ప్రకారం మరో 60 మిలియన్ల మంది, నూతన గృహాలలోకి చేరుతారు.

మరొక ప్రధాన రంగం వ్యవసాయాభివృద్ధి. గత పంచవర్ష ప్రణాళికలో సోవియట్ యూనియన్ అద్భుత విజయాలు సాధించింది. 1966—69 సంవత్సరాలలో సగటు ధాన్యం ఉత్పత్తి 162 మిలియన్ టన్నులు. దాదాపుగా 46 మిలియన్ టన్నుల ఎరువుల వాడకం జరిగింది. ట్రాక్టర్లు, ఇతర వ్యవసాయ సదుపాయాల ధరలు సోవియట్ రైతులకు అందుబాటులో ఉండటం వల్ల వారు వ్యవసాయాన్ని యాంత్రీకరణం చేయగలుగుతున్నారు. వచ్చే పంచవర్ష ప్రణాళికలో 195 మిలియన్ టన్నుల పప్పు ధాన్యాలు పండించాలని లక్ష్యం. వ్యవసాయ క్షేత్రాలకు 72 మిలియన్ టన్నుల ఎరువులు లభ్యమవుతాయి.

9 వ పంచవర్ష ప్రణాళిక ఒక్క సోవియట్ పౌరులకు మాత్రమే ముఖ్యంకాదు. వర్ధమాన దేశాలకు కూడా ఎంతో ముఖ్యం. కారణం ఈ దేశాలకు సోవియట్ యూనియన్ నుంచి అదనపు సహాయం లభిస్తుంది. ప్రస్తుతం 40 వర్ధమాన దేశాలతో సోవియట్ యూనియన్‌కు ఆర్థిక, సాంకేతిక సహకార సంబంధాలు ఉన్నాయి. భారత దేశంతో సహా ఆసియాలో 18 దేశాలతో సోవియట్‌కు ఆర్థిక సంబంధాలు ఉన్నాయి. నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలకు సోవియట్ యూనియన్ నుంచి లభ్యమయ్యే మొత్తం సహాయం 5,000 మిలియన్ రూబుళ్లు (5.5 బిలియన్ డాలర్లు.) ఈ దేశాల్లో సోవియట్ సహాయంతో 700 పారిశ్రామిక, వ్యవసాయ ప్రాజెక్టుల నిర్మాణం సాగుతోంది. నూతన ప్రణాళికాంతానికి విదేశ వాణిజ్యం 33—35 శాతం పెరుగుతుందని అంచనా.

భారతదేశంలో ఈ ప్రణాళిక ప్రత్యేకమైన ఆసక్తిని రేకెత్తించింది. గత ఒకటిన్నర దశాబ్దాలుగా, ఉభయ దేశాల మధ్య ఆర్థిక సంబంధాలు మరింత పటిష్ఠవంతమయ్యాయి. సోవియట్ ఉన్నత వాణిజ్య ప్రతినిధి బృందం ఇటీవల ఢిల్లీ సందర్శించిన దృష్ట్యా ఉభయదేశాల మధ్య వాణిజ్యం మరింత శీఘ్రంగా విస్తృతం కాగలదని ఆశించవచ్చు.

(24వ పార్టీ సమావేశం సందర్భంలో వ్రాసిన వ్యాసం)

# అమెరికాలో...

(47 వ పేజీ తరువాయి)

[illegible] ఒక 12 ఏళ్ళ [illegible] ఆసుపత్రిలో [illegible]. కాని వెంటనే ఆ పిల్ల మరణించినదట. తరువాత తెలుసుకొన్న విషయము 20 ఏళ్ల తల్లి హెరాయిన్ [illegible] యీ కిటుకు [illegible]!

**అతి తాజా వార్తలు —**

సినిమా నటుడు టోనీకర్టిస్‌ను లండన్ విమానాశ్రయంలో అరెస్టు చేశారు. కారణం: అతని కోటు జేబులో మరిహ్వానా సిగరెట్లు ఉన్నందున. అతను (టోనీకర్టిస్ టెలివిజన్‌లో ఈ అలవాటు మంచిది కాదని సందేశాలు యిచ్చేవాడు.) రాబర్ట్ కెన్నెడీ చిన్న కుమారుడు యీ మధ్య అరెస్టు చేయబడ్డాడు. అతనికి మరిహ్వానా అలవాటు ఉన్నట్లు పోలీసులు ఆరోపించారు.

నాకు అప్పుడప్పుడు యిలా అనిపిస్తూ ఉంటుంది. యీ విధంగా యీ మందు అలవాటుకు అమెరికాలోని యువ ప్రపంచం బానిసయిపోతే యీ దేశ భవిష్యత్తు ఏమిటి? అని.

నేను పైన చెప్పిన కథ ఒక్క పీటర్ మూరింది మాత్రమే కాదు. అమెరికాలో యువతరాని కంతా యిది వర్తిస్తుంది. యిప్పటివరకు అనేకమంది పీటర్ల కరుణామయ గాథలు విన్నాను. యిప్పటికిప్పుడు నేను ఈ అలవాటు నశిస్తుందని ఆశిస్తున్నాను.

ఈ వ్యాసం,

అమెరికా అంటే స్వర్గానికి మరో పేరని అనుకొనే ప్రజలకు—కాదు! యిది ఒక [illegible] అని సందేశం యివ్వాలి—అంకితం.

— డా. జూటూరు పాండురంగవిఠల్

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press: 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.